# విషయసూచిక



# శ్రీ రామకృష్ణ ప్రభ

## చందాదారులకు

౧. పత్రిక ప్రతిమాసము ౧౧-వ తేదీన వెలువరింపఁబడును. ఒక వారము, పదిరోజులు దాఁటి ప్రతి మీకు అందకపోయినయెడల ఉత్తరము వ్రాయుఁడు.

౨. సంవత్సర చందా రు. ౩ లు మాత్రమే. జనవరి నెల నుండిగాని జూలై నెల నుండిగాని చందాదారులుగఁ జేరవచ్చును. ఇతర మాసములలోఁ జేరఁదలచు వారికి జనవరి నెల నుండిగాని జూలై నెల నుండిగాని సంచికలు చేర్చిపంపఁబడును. విడిప్రతి రూ. ౦—౬—౦ లు. హిగిన్‌బాదంస్ వారి స్టాలులోఁగాని, మా పత్రిక ఏజెంటును గాని అడుగుఁడు.

౩. ఉత్తర ప్రత్యుత్తరములు వీలైనంతవఱకు ఇంగ్లీషున వ్రాయుచు మీ చందాదారు సంఖ్య నుదాహరింపుఁడు. ఉత్తరములను "మేనేజరు, శ్రీరామకృష్ణప్రభ" అను చిరునామాకు వ్రాయుఁడు.

౪. చిరునామాయందు ఏట్టిమార్పుకలిగినను 10 వ తారీఖునకు ముందుగా మా కార్యాలయమునకుఁ దెలుపవలయును. లేనిచో, పత్రిక పూర్వపు చిరునామాకే పంపఁబడును.

## వ్యాసకర్తలకు

౧. కేవలము నైతిక ధార్మిక వైజ్ఞానిక విషయకములైన వ్యాసములేకాక, సాహిత్యమునకును కవిత్వమునకును సంబంధించిన ఏ వ్యాసములైనను బంపవచ్చును. సులభ సుందరమగు గ్రాంథికభాషలో వ్రాయవలయును.

౨. వ్యాసములు అచ్చులో మూఁడు పుటలకు మించరాదు. ప్రతినెల మొదటి తేదీకి వ్యాసములు మాకు అందవలెను.

౩. వ్యాసములను, విమర్శకుఁ బంపు గ్రంథములను, వినిమయముగఁ బంపెడి పత్రికలను "సంపాదకుఁడు, శ్రీరామకృష్ణ ప్రభ శ్రీరామకృష్ణ మిషన్ స్టూడెంట్స్ హోమ్, మైలాపూరు, చెన్నపురి" అను చిరునామాకు వ్రాసి పంపవలెను.

౪. వ్యాసము తిరుగఁ బంపఁబడవలయుననుచోఁ దగు పోస్టేజి చేర్చి పంపవలయును.

# శ్రీ వివేకానందస్వామి జీవితచరిత్ర

(ఆఱవ కూర్పు)

శ్రీ చిరంతనానందస్వామి విరచితము

ఇందు శ్రీ స్వామివారి జీవితవిశేషములు సంపూర్ణముగ వివరింపబడి యున్నవి. ఇంతకు పూర్వము గ్రంథస్థములుగాని ముఖ్య సంఘటనలు శ్రీవారి సోదర శిష్యులవలన విని యిందు గూర్పబడియున్నవి.

పండితాభిప్రాయములు

"ఈ గ్రంథము దివ్యముగా వ్రాయబడినది..."

—కట్టమంచి రామలింగారెడ్డి

"ఈ గ్రంథము తెలుఁగువారి యింటింటను ఇలువేల్పుగా నుండఁదగినది."

—వేలూరి శివరామ శాస్త్రి

"...రచనారీతి దివ్యసుందరము..."

—వేటూరి ప్రభాకర శాస్త్రి

432 పుటలు — వెల : రూ. 3-0-0

---

# ప్రబోధరత్నాకరము

ఇందలి గద్యానువాదకుడు శ్రీ చిరంతనానందస్వామి, పద్యానువాదకులు మహాకవి విశ్వనాథ సత్యనారాయణ, కవికోకిల జి. జాషువ. తత్త్వశాస్త్రాంశములన్నియు నిందు వివరింపబడి యున్నవి.

"...చక్కని తెనుగు అనువాదము... అందమైన అచ్చు, ఆకర్షణీయమైన రూపము..."

—గోలకొండ పత్రిక

"... తత్త్వశాస్త్ర సారసంగ్రహము ; ముముక్షువుల కిది నిజముగా మార్గదర్శి."

—ప్రజామిత్ర

228 పుటలు — వెల : రూ. 2-4-0

---

ఇట్లు వ్రాయుడు :

శ్రీ రామకృష్ణమఠము, మైలాపూరు, చెన్నపురి



పశ్చిమ బంగాళము హుబ్లీ జిల్లా కమ్మారిపుష్కరిణియందలి

**శ్రీ రామకృష్ణ నూతన దేవాలయము**

శ్రీ రామకృష్ణమఠ సేవాసంఘ సర్వాధ్యక్షులు

పూజ్యపాదులు శ్రీమత్ శంకరానందస్వాములవారిచే

**11-5-1951** న తెఱువబడినది.

(నమూనాదారు : డాక్టరు నందలాల్‌బోసు)




# శ్రీరామకృష్ణ ప్రభ

సంపుటము ౯ } ౧౯౫౩ - ఫిబ్రవరి : : నందన - మాఘము { సంచిక ౨


# శ్రీ రామకృష్ణస్తోత్రమ్


శ్రీ దేవరకొండ నారాయణశాస్త్రి


శ్లో॥ శ్రీకాళీ పదసారసస్థమధుపానోన్మత్త భృంగప్రభుం।
శ్రీకాళీగుణనామకీర్తన సుధాంభోరాశి మగ్నప్రభుం।
శ్రీకాళీనిలయే వసన్త మనఘం శ్రీ రామకృష్ణప్రభుం।
శ్రీకాళీప్రియనందనం త్రిజగతాం బంధుం ప్రవందే సదా॥ 1

శ్లో॥ ఓం తత్సత్ పదవాచ్యమంతరహితం శ్రీరామకృష్ణేశ్వరం।
విద్యాసార భృతాంతరంగమమలం విద్యావిహీనం గురుం।
వందే సుందర దేహధారిణ మనంగాకారవంతం ముదా।
మే దేయా దమృతత్వసౌఖ్య మతులం శ్రీరామకృష్ణప్రభుః॥ 2

శ్లో॥ హేమానవాః శృణుతైవై యుయమోక్షకామాః। "శ్రీరామకృష్ణ" ఇతి కశ్చన మోక్షదాతా।
లోకేఽస్తి తం భజత నిశ్చలభక్తియుక్తాః। వోఽభీష్టసిద్ధి మచిరాత్ సకరిష్యతీడ్యః। 3

శ్లో॥ యో "నేతినేతీ"తి విచారవేద్యః। సర్వత్ర పూర్ణోపి నమూఢవేద్యః।
తం రామకృష్ణం పరమాత్మరూపం। వందే సదానంద మరందసింధుం॥ 4

శ్లో॥ నదుష్టనాశాయ సరామకృష్ణో। గృహీతవాన్ కాయమపూర్వశీలం।
కింతు ప్రదాయేశ్వర భక్తిభావం। కర్తుం సుదుష్టానపి శిష్టవర్యాన్।
వందే తమత్యద్భుత శక్తిమంతం॥ 5

శ్లో॥ సదా ఖుదీరామకుమారరత్నమ్। ఫిజాష్యహం భాంతియోగిరత్నం।
ముముక్షు సంఘాంత మనశ్చకోర। వశీకృపత్కాంత్య దినోడునాథం॥ 6

శ్లో॥ ''బోధయితుం లోకాయత్వం వై। భావముఖావస్థాయా మాస్వే''
తి జగజ్జననీ చాజ్ఞాం కస్మై। దత్తవతీ తం జ్ఞపతిం వందే॥ 7

శ్లో॥ రూప్య స్పర్శో వృశ్చిక విషవద్। బాధా మకరోద్యస్య శరీరే।
గురుదేవం తం నిరుపమశీలం। త్యాగాకారం వందేభక్త్యా॥ 8

శ్లో॥ గాంధ్యరవిందరవీంద్రాది మహా। పురుషైర్వినుతం గురుగుణశరధిం।
మద్గురు వరగురు గురుదేవం తం। ప్రణమామి నమామి పునశ్చపునః॥ 9

శ్లో॥ అచలసమాధౌ యష్షణ్మాసా। స్తస్థౌ సోఽస్మాన్ గురురాడవతాత్।
తం భగవద్దర్శక వర్యమహం। ప్రణమామి నమామి పునశ్చ పునః॥ 10

శ్లో॥ రామకృష్ణభగవత్ సమదైవమ్। రామకృష్ణగురుతుల్యగురుర్వా।
నాస్తి నాస్తి దివివాఽపిచ భూమౌ। తం నమామి గురుదేవ మఖండమ్॥ 11

శ్లో॥ రామకృష్ణగురు వచ్చ విముక్తిం। కే దదుఃస్మ గురవో మనుజేభ్యః।
రామకృష్ణగురువత్ పరితప్తః। కోగురుర్వదత శిష్యవిముక్త్యై॥ 12

శ్లో। ''యస్తు రామశ్చ కృష్ణశ్చ। స ఏవాసౌ రామకృష్ణః।''
ఇతియో హ్యావదత్ తంవై। ప్రణమామి పదేపదే॥ 13

శ్లో॥ ప్రభూత ప్రభావం ప్రతీత ప్రకాండమ్। ప్రపన్నప్రపంచ ప్రహర్షప్రదంవై।
ప్రపూజ్య ప్రధానం ప్రధానాత్ పరం తం। ప్రసన్న ప్రకాశం భజే రామకృష్ణం॥ 14

శ్లో॥ సుపర్వాణ వంద్యం సుదుర్దర్శరూపం। మహానందవార్ధిం మహాధీరలభ్యం।
నిరాకార మాకార కర్తార మీశం। తురీయం నిరంతం గురుం తం స్మరామః॥ 15

శ్లో॥ ధరణీసుర రూపధరోఽఖిలరాట్। పరహంసవరః కురుతాత్ కుశలం।
జగదేకగురుం జ్ఞవరం వరదం। ప్రణమామి నమామి పునశ్చ పునః॥ 16

శ్లో॥ భజామి రామకృష్ణదేవ మంబికానిభం ముదా।
జపామి రామకృష్ణదేవ దివ్యనామ సర్వదా।
స్మరామి రామకృష్ణదేవ మూర్తి మార్తి హారిణీం।
కరోతు మంగళాని న స్సరామకృష్ణ రూపధృత్॥ 17

శ్లో॥ ఇమం (శ్రీ) విరజానంద గురవేఽహం సమర్పయే।
సర్వాంతరాత్మా భగవాన్ రామకృష్ణశ్చ తుష్యతు॥



ఓం నమో భగవతే శ్రీ రామకృష్ణాయ!

# శ్రీ రామకృష్ణ వచనామృతము—'మ.'

## దక్షిణేశ్వరమున శ్రీరామకృష్ణ 'మ.' ల సంభాషణము

19-12-1883.

శ్రీ రామకృష్ణ గురుదేవుడు దక్షిణేశ్వరమున బిల్వవృక్షచ్ఛాయను 'మ.' తో మాట్లాడుచుండెను. అది ఉదయము తొమ్మిదిగంటల వేళ. ఆ బిల్వవృక్షము శ్రీ రామకృష్ణ గురుదేవుని సాధనభూమి. అతినిర్జనస్థానము. దాని యుత్తరదిశను ప్రేలుడుమందు కార్ఖానా గోడ గలదు. పడమటిదిశను సరుగుడుచెట్ల 'చో చో' మను శబ్దము మనోభేదనప్రాయమై ఎల్లప్పుడు వినిపించుచుండెను. అటుపయిన భాగీరథీ నది. దక్షిణదిశయందు పంచవటి కనిపించుచున్నది. ఎందుజూచినను చెట్లసమూహము వలన సరిహద్దు గోడలేవియు కనిపించుటలేదు.

శ్రీరామ:—('మ.' తో) కామినీకాంచన త్యాగమువినా ఏమియు నెఱవేఱదు.

'మ.':—ఎందువలన? 'ఓ రామా! సంసారము భగవద్విహీనమయినచో దానిని త్యజింపుము' అని శ్రీరామచంద్రునకే వశిష్ఠు లుపదేశించియున్నారుగదా!

శ్రీరామ:—(కొలదిగ నవ్వుచు) అది రావణవధకొఱకే బోధింపబడినది! అందువలన శ్రీరామచంద్రుడు సంసారమగ్నుడై వివాహమయ్యెను.

'మ.' అట్టే ఆశ్చర్యపడి కొయ్యవలె నిర్విణ్ణుడైపోయెను.

శ్రీ రామకృష్ణ గురుదేవు డిట్లు పలికి తన గదికి పోవుటకై పంచవటి కభిముఖముగా నడువ నారంభించెను. పంచవటి చేరగనే శ్రీ గురుదేవుడు 'మ.' తో మఱల మాటాడ మొదలుపెట్టెను. సుమారు పదిగంటలయ్యెను.

'మ.':—ఏమండీ! నిరాకారసాధన నవలంబింపరాదా!

శ్రీరామ:—అందులకేమి యభ్యంతరము! కాని అది అత్యంతకష్టమయినది. *

పూర్వఋషులు ఎంతో తపమొనరించి బ్రహ్మ మెట్టి వస్తువో కనుగొని తమలో తాము అనుభవించెడివారు. వారెంతయో కష్ట పడువారు. తమకుటీరములనుండి యుదయముననే వెడలి దినమంతయు తపమొనర్చి సాయంకాలమునకు దిరిగివచ్చెడివారు. ఆ పిమ్మట ఏవో కందమూలఫలాదులు రెండు భక్షించెడివారు.

* శ్లో. క్లేశోఽధికతర స్తేషా మవ్యక్తాసక్తచేతసామ్
అవ్యక్తా హి గతిర్దుఃఖం దేహవద్భిరవాప్యతే. -గీత. 12-5.

ఈ సాధనయందు బుద్ధిప్రభావ మణుమాత్ర మును నుండరాదు. రూపరసగంధస్పర్శముల విషయములకు మనస్సున చోటుండరాదు. అప్పుడే మనస్సు శుద్ధమగును. శుద్ధమనస్సే శుద్ధాత్మ. మనస్సున విషయవాంఛలు సంపూర్ణముగ నశింపవలయును.

ఆ సమయమున మఱియొకస్థితి కలుగును. ఆ స్థితియందు 'భగవానుడే కర్త నేను అకర్తను' అన్న భావము స్ఫురించును. అంతట 'నేను లేనిచో ఇతరుల సుఖదుఃఖములు జరుగనేరవు' అన్న అజ్ఞానభావము నశించును.

ఒక మఠస్థుడగు సాధువును ఒకానొక దుష్టుడు కొట్టెను. ఆ సాధువు స్పృహతప్పి పడిపోయెను. చేతనము కలిగిన సమయమున నెదుటివారు 'మీకు ఎవరు పాలుపోయుచున్నా' రని అడుగగా 'ఎవరు నన్ను గొట్టిరో వారే నాకు పాలుపోయుచున్నారు' అని బదులు చెప్పెను.

'మ.':—ఇది నే నెఱుగుదును.

శ్రీరామ:—తెలిసినంతమాత్రమున చాలదు. మనస్సున ధారణచేయవలయును. విషయ చింతలు మనస్సును సమాధిస్థితిని బడయ నీయవు.

విషయబుద్ధి సమస్తమును నొకేపరి త్యజించినచో స్థితసమాధి లభించును. అట్టి స్థిత సమాధి కలిగినచో దేహత్యాగము సంభవించును. అందువలననే 'భక్తి-భక్తులు'— వీరితో నుండవలయునని నా యభిలాష. అందువలన శరీరమునందును మనస్సు కొద్దిగా గలదు.

మన్మనసమాధి మఱియొక విధమయినది. అనగా, హఠాత్తుగా చెదరిన మనస్సును పదిల పఱచుట. తెలిసినదా?

'మ.':—చిత్తము.

శ్రీరామ:—చెదరిన మనస్సును పదిలపఱచుట! ఈ సమాధి ఎంతోకాలముండదు. విషయాసక్తులు ప్రభవించి దానికి భంగము కలిగించును. యోగుల యోగము భంగమగును.

ఆ యూరియందు * గోడలోని బొరియలలో ముంగిసలు నివసించుచుండును. అవి బొరియలలో నున్నప్పు డెంతో హాయిగా నుండును. కొందఱు వాని తోకలకు ఇటుకలు కట్టుదురు. అప్పుడవి ఆ యిటుకల భారమువలన వెలుపలికి వచ్చును. అవి యెన్నిసార్లు లోనికిబోయి హాయిగా నుండదలంచినను ఇటుకల భారము వానిని బయటికి లాగుచుండును. విషయాసక్తు లిట్టివే. యోగిని యోగభ్రష్టుని జేయును.

విషయాసక్తులు గల మానవులకు సయితము సమాధి, అపుడపుడు కలుగుచుండును. సూర్యుడుదయించినపుడు పద్మములు వికసించును. కాని సూర్యుడు మేఘమువలన ఆచ్ఛాదితుడయినపుడు పద్మములు ముకుళించును. విషయసమూహమే మేఘము.

'మ.':—సాధనలొనరించుటవలన మనకు భక్తిజ్ఞానములు రెండును లభింపవా?

శ్రీరామ:—భక్తితో నున్నచో రెండును లభించును. అవసరమని తోచినచో భగవాను డట్టివానికి బ్రహ్మజ్ఞానమును సయిత మిచ్చును. మిక్కిలి శ్రేష్ఠులగువారికి రెండును ఏకకాలమున లభింపవచ్చును. శ్రీ చైతన్యప్రభువువలె

---

* కమ్మరపుష్కరిణియందు. 'నాది' అన్న మమకారమును మాటలతో సయితము నంటరాదని శ్రీరామకృష్ణ గురుదేవుడు 'మా' యూరు అనుటకు బదులు 'ఆ యూరు' అని పలికెడివారు.

నీశ్వరకోటికి జెందినవారికి ఇట్లు జరుగును. జీవకోటిమాట వేఱు.

వెలుతురు పంచవిధములు. దీపకాంతి, వివిధాగ్నుల వెలుగు, చంద్రకాంతి, సూర్య ప్రభ. ఆ పిదప సూర్యచంద్రుల అన్యోన్యమగు వెలుగు. భక్తి చంద్రునివంటిది. జ్ఞానము సూర్యునివంటిది. అపుడపుడు సూర్యాస్తమయ మునకు పూర్వమే ఆకసమున చంద్రోదయమగు చుండును. అవతారపురుషుల భక్తిచంద్రుడు జ్ఞానసూర్యుడు ఒకేసమయమున ప్రకాశించు చుందురు.

తలచినచో 'ఏక కాలమున భక్తిజ్ఞానములు అందఱకును కలుగునా? అదంతయు ఆధార విశేషము. కొన్ని వెదుళ్లయందు రంధ్రము పెద్దదిగను కొన్నిటియందు చిన్నదిగను నుం డును. భగవద్వస్తువును భరించుటయందు అం దఱును సమాన అధికారులా? సేరు పట్టు చెంబున రెండుసేర్ల పాలు పట్టునా?

'మ.':—ఎందువలన? ఆయన కృపవలన నేమియు జరుగదా? ఆయనకృప కలిగినచో సూది బెజ్జముగుండ ఒంటెనుగూడ దూర్చ వచ్చునని వచింతురుగదా!

రామ:—కాని, కృప అంత సులభ ముగా లభించునా? భిక్షుకు డొక దమ్మిడీ నడిగి నచో నిత్తుము. 'రైలుచార్జి' అడిగిన?

'మ.' ఏమియు బదులుచెప్పకుండ నిలు చుకొనియుండెను. శ్రీ రామకృష్ణ గురుదేవుడు గూడ నూరకుండెను. పిదప హఠాత్తుగా 'అవును, కొన్నిఆధారములందు ఆయనకృప వలన రెండును కలుగవచ్చును.'

'మ.' శ్రీ గురుదేవునకు నమస్కరించి బిల్వవృక్షచ్ఛాయకు బోయెను.

అతడు మఱలివచ్చుటకు మధ్యాహ్నము దాటిపోయెను. కాలాతిక్రమణమయినదని శ్రీ రామకృష్ణ గురుదేవుడు బిల్వవృక్షాభి ముఖుడై పోవుచుండెను. 'మ.' ఆసనము, చెంబు పట్టుకొని పంచవటియొద్ద శ్రీవారిని కలిసికొని వారికి సాష్టాంగప్రణామ మొనర్చెను.

శ్రీరామ:—('మ.' తో) నిన్ను వెదకు టకు బయలుదేరితిని. ఇంతసేపయినదిగదా! ఒకవేళ గోడదాటి పారిపోయితివేమో యను కొంటిని. ఉదయమున నీకనుల స్థితిని జూచు నప్పటికి నారాయణశాస్త్రివలె పారిపోవుదు వని తలంచితిని. పిదప 'అట్లు పారిపోవువాడు గాడు. చక్కగా ఆలోచించియే ఏ కార్యము నయినను చేయు'నని తోచినది.



# శ్రీ వివేకానంద స్మృతి

[భగవంతుని నెవరును జూపనేరరు. ఆ భగవద్దర్శనము ఇంద్రియగోచరము కానిదగుటయే యిందులకు గల ప్రబలకారణము. కాని భగవత్సాక్షాత్కారము నందినవారిని మన మప్పుడప్పుడు జూడవచ్చును. వారి ఆధ్యాత్మికజీవనము, ప్రపంచమున వారు వ్యవహరించు రీతి—వీనినిబట్టి వారు భగవత్సాక్షాత్కారభాగ్యము బడసినవారని మనము తెలిసికొనవచ్చును. ఇటీవల భారత దేశమునం దవతరించిన మహాపురుషులలో శ్రీ వివేకానందులవా రొకరని సమస్త జగత్తు నెఱిగిన విషయము. ఆ మహానుభావునితో నెంత స్వల్పకాలము కలిసియున్నను ఎందరో తమ జీవిత మంతయును నిత్యనూతనము జేసికొని యున్నతస్థితికి రాగలిగిరి. అట్లు శ్రీ స్వామివారితో కలిసి కొను భాగ్యమును బడసి తమ జీవితమును సంపూర్ణముగ పవిత్రముజేసికొని జీవితాంతము (1949) వఱకు శ్రీవారి గుణకీర్తనము చేయుచుండిన జోసఫీన్ మెక్లాడ్ (Josephine Macleod) ఇట్లు తన స్మృతిని వెల్లడించుచున్నది. ఈ స్మృతి పఠనమున శ్రీ స్వాములవారి మహత్త్వము, ఉదారస్వభావము అత్యద్భుతమును కూలంకషమునగు నైపుణ్యము తేటతెల్లము కాగలవు.

—సంపాదకులు.]

(గత సంచిక తరువాయి)

ఒకనాడు వర్షము కురియుచుండ, శ్రీ స్వాములవారు, సింహళమునుండి వచ్చిన బౌద్ధ భిక్షువు అనగారిక ధర్మపాలుని మాయొద్దకు దీసికొనివచ్చిరి. ఆ సమయమున నేను, ఓలి బుల్ కన్య, సోదరి నివేదితయు కలిసి ఆ చిన్న యింట నివసించుచుంటిమి. పాశ్చాత్యమహిళలు చిన్నయింటినిగూడ ఎట్లు చక్కబఱచి వాసయోగ్యమొనర్చి, ఎట్లు నివసించుచుండిరో చూపించుటనిన శ్రీవారికి ఎంతయో ప్రీతి.

1895 వ సంవత్సరము మేనెల 12 వ తారీఖున మేమెల్లరము కాశ్మీరమునకు బయలు దేరితిమి. మార్గమధ్యమున నైనిటాలున విశ్రమించితిమి. అచట వందలకొలది ప్రజలు శ్రీవారిని కలిసికొని వారికి చక్కని (Hill-Pony) గుఱ్ఱమును దీసికొనివచ్చి బహూకరించి దానిమీద శ్రీవారిని కూర్చోబెట్టిరి. పిమ్మట వారందరును దోయిళ్లతో పూలుబట్టి మార్గమంతట జల్లిరి. అది చూచినంతట నాకు బైబిలువాక్యము స్ఫురించినది. క్రీస్తు జెరూసలేము వెళ్లుచుండగా ప్రజలు ఆయనయెదుట పూలు చల్లిరని బైబిలున జెప్పబడియున్నది. ఈ పుష్పములు చల్లుట ప్రాచ్యదేశమునందే అలవాటు అని ఆ సమయమున నాకు స్ఫురించినది. శ్రీ స్వాములవారు మూన్నాళ్లు మమ్ము సంపూర్ణముగా వదలి యెచ్చటికో వెళ్లిపోయిరి. మే మొక హోటలున నుంటిమి. తరువాత శ్రీవారు మమ్ము బిలిపించిరి. శ్రీవా రొక చిన్నయింట నొక మంచముమీద కూర్చొని యుండిరి. మమ్ము జూచినంతటనే శ్రీవారికి నిర్భరానందము కలిగినది. శ్రీవారికి మేము సంపూర్ణ స్వాధీనత నొసగితిమి. మేము శ్రీవారితో వెళ్లుచున్నప్పటికిని వారినిగూర్చి మేమేమియు లక్ష్యించెడివారము గాము. మేము శ్రీవారికి భారముగ నుండినవారము

గాము. ఎట్టి వినోదములకుగూడ అవసరము లేకుండెడిది.

అచటినుండి మేము ఆల్మోరాకు బయలు దేరితిమి. అచట శ్రీవారు సేవియరు దంపతుల ఆతిథ్యమును స్వీకరించిరి. మేమందఱము నొక 'బంగళా' అద్దెకు దీసికొని నెలనాళ్లుంటిమి.

మే మచట నుండగా, గుడ్విన్ మహాశయుడు పరమపదించినట్లు తెలియవచ్చినది. శ్రీవారీ పలుకు విన్నంతనే హిమభూయిష్ఠమయిన హిమాలయపంక్తి నెంతోకాలము ఏకదృష్టితో జూచుచు కూర్చొనిరి. పిమ్మట నా చివరి యుపన్యాసము ముగిసినది అని హఠాత్తుగా బలికిరి. ఆ తర్వాత శ్రీవా రెన్నడును బహిరంగోపన్యాసము నొసగినవారు కారు.

ఆల్మోరానుండి జూన్ 25 న కాశ్మీరమునకు బయలుదేరితిమి. రావల్పిండివఱకు రైలున పయనించితిమి. అచటినుండి 'టాంగా' మీద బయలుదేరితిమి. ఆ కాశ్మీరమున మేము నాలుగుమాసములుంటిమి. అచట మాకును శ్రీవారికిని జరిగిన సంభాషణలు చాలవఱకు సోదరి నివేదిత తన గ్రంథములందు ప్రతిబింబింపజేసినది. శ్రీవారు ప్రతిదినము ఉదయము 5 ఘంటలకు లేచి చుట్ట గాల్చుకొనుచున్న పడవవారితో మాటాడెడివారు. ఆ చప్పుడు విని మేమును మేల్కొనెడివారము. ఆ పిమ్మట దాదాపు రెండుఘంటలకాలము మేమెల్లరము పచార్లుచేసెడివారము. సూర్యాతపము హెచ్చునంతవఱకు శ్రీవారు 'మహమ్మదీయుల దండయాత్రలతో భారతదేశ మెట్లు అణగారిపోయినదియు' విశదముగా వివరించుచుండెడివారు. భారతీయ నాగరికత, శిల్పకళానైపుణ్యము, భారతీయుల ఆచారములు—ఇవన్నియు బోధించుచు శ్రీవారు తన్మయులై మైమఱచెడివారు.

అచటినుండి మేము 'బరముల్లా' వెళ్లితిమి. ఆ నగరము ఇటలీయందలి వెనీసునగరమును బోలినది. అందలి వీథులన్నియు కాలువలే. మే మొక చిన్నపడవను దీసికొంటిమి. మే మటునిటు తిరుగుచుండగా వ్యాపారులు కొందరు తమ సరకుల విక్రయించుకొనుటకై తమ చిన్న పడవలలో మమ్మెదుర్కొనెడివారు. మేము మూడు పడవల దీసికొంటిమి. ఒక్కొక్కదానికి నెలకు ముప్పదిరూపాయల అద్దె. పడవలనడుపు కూలీలు కుటుంబమునందలివారెల్లరు—భర్త భార్య బిడ్డలు—అందరు నడిపెడివారు. వారు వంట చేయుచో గమగమలాడెడిది. అది గ్రహించి మీ వంట (ఆహారము) కొంచెము పెట్టుడు అని వారిని అడుగుకొని రుచిచూచెడివారము.

అచట నుండగా శ్రీ స్వాములవారిని జూచుటకై పండితులు తండోపతండములుగా వచ్చెడివారు. వారు శ్రీవారిని మమ్మును జూచి 'స్వామీ, మీ రేల వీరిని జేరదీసితిరి. వీరు మ్లేచ్ఛులు, అస్పృశ్యులుగదా' అని పలికెడివారు. ఒక్కొక్కపుడు కొందరు పాశ్చాత్యులు మమ్ము సమీపించి 'ఏమిటి? ఈ స్వామిజీ తలపాగలేని ముండితమస్తకముతో మిమ్మగౌరవపఱచుచున్నాడు. మీ కింకను అవగాహన కాలేదా?' అని హెచ్చరించెడివారు. వారందరును వెళ్లిన పిమ్మట మేమును శ్రీ స్వాముల వారును కలిసికొని మా మా నాగరీకతలయందు గల వెఱ్ఱిపట్టుదలలను దలంచుకొని కడుపుబ్బ నవ్వుకొనెడివారము.

పిమ్మట భారతదేశమునందలి ముఖ్యక్షేత్రములగు లాహోరు, ఢిల్లీ, కలకత్తా మున్నగు వానిని మాకు జూపుటకై శ్రీ శారదానంద స్వాములవారిని నియమించి, శ్రీవారు కలకత్తాకు

వెళ్లిపోయిరి. మేమీ యాత్ర సలిపి కలకత్తా చేరునంతలో శ్రీ స్వాములవారు మేమున్న యింట నొక మఠమును స్థాపించిరి. ఈ మఠము కొఱకు ఓలిబుల్ సతి ఎన్నియోవేల డాలర్ల నొసగినది. నాయొద్ద పైకమంతగా లేకపోయినది. కావున ఎనిమిదివందల డాలర్లు ఎంతో కష్టముమీద సేకరించితిని. ఒకనాడా ధనమును దీసికొని శ్రీ స్వాములవారినిజూచి, 'స్వామీ, ఇదిగో ఈ స్వల్పమయిన కానుకను మీ రెందులకయినను వినియోగింపుడు' అని చెప్పితిని. 'అట్లా, అట్లా' అని శ్రీవారు రెండు పర్యాయములడిగిరి. 'ఔ' నని నేనంటిని. పిమ్మట 'ఎంతధనము దెచ్చితివి?' అని యడుగగా 'ఎనిమిదివందల డాలర్లు' అని చెప్పితిని. వెంటనే దగ్గరనున్న త్రిగుణాతీతానందస్వామిని బిలిచి 'ఇదిగో, తీసికొనివెళ్లి యిపుడే ముద్రణ యంత్రమును కొనుము' అని పలికిరి. వారును ముద్రణయంత్రమును గొని శ్రీ రామకృష్ణ సంస్థవారి ఉద్బోధన మాసపత్రిక (బెంగాలీ భాష) ను బ్రారంభించిరి.

1899 వ సంవత్సరము జూలై మాసమున శ్రీ స్వామివారు సోదరి నివేదిత సోదరి క్రిస్టైన్ లతో ఇంగ్లండునకు దిరిగి వచ్చిరి. అక్కడ నుండి అమెరికాకు వచ్చిరి. అమెరికాయందు మునుపు శ్రీవారుండిన గృహమునే వారి కొసగితిమి. అపుడు శ్రీ తురీయానంద అభేదానందస్వాములవారును శ్రీవారితో నుండెడివారు. సోదరి నివేదిత, ఓలిబుల్ సతి యున్నపుడచటికి వచ్చియుండిరి. మేమెల్లరమును శ్రీ స్వామివారికి గౌరవప్రతిపాదకమగు కుటుంబమైతిమి. మా అక్క లగ్గెటు సతిని శ్రీవారు 'అమ్మా' యని పిలుచుచు ఆమెయొద్దనే భోజనమునకు గూర్చొనెడివారు. శ్రీవారికి చాకొలేట్ ఐస్ క్రీమ్ తినుటయం దెంతో అభిరుచి. 'నేనుగూడ చాకొలేటును * గనుక నాకు దానియం దమితప్రేమ' అని శ్రీవారు పలికెడివారు.

ఒకనాడు మేము కొన్ని స్ట్రాబెర్రీ పండ్లను (Straw-Berry fruits) తినుచుంటిమి. అందొకరు 'ఏమండీ స్వామీజీ మీ కివి యిష్టమా' యని ప్రశ్నించిరి. 'నేను వానినెన్నడు రుచి చూడలేదు' అని శ్రీవారు పలికిరి.

ఒకరు : అబ్బా! ఎప్పుడును రుచిచూడలేదా? మీరు ప్రతిదినమును వానినే తినుచున్నారు.

స్వామివారు : ఓ, దానిమీద మీరు మీగడ వేయుచున్నారు. గుండ్రాళ్లమీద మీగడ వేసినచో అవియును బాగుగనే యుండును.

సాయంకాలములయందు గూర్చొని శ్రీవారు సంభాషింప మొదలుపెట్టినచో మాటలసందట ఎవరయినను 'స్వామీజీ! ఆ విషయమున నేనేకీభవింపజాల'నని పలికినచో 'అది నీకుగాదు' అనియును ఎవరేని 'స్వామీజీ ఈ విషయము అత్యంతము ఉత్తమోత్తమము' అన్నచో 'అది నీకొఱకే' అనియు పలుకుచు ప్రతివారి భావమును కొంచెమయినను నొప్పింపక రంజింపజేయుచుండెడివారు.

(సశేషము)

* శ్రీవారు చాకొలేటు రంగును బోలిన తమ శరీరచ్ఛాయను సూచించుచున్నారేమో!

# మా న స బో ధ

బాలకవి శ్రీ ఓరుగంటి నారాయణప్ప

(గత సంచిక తరువాయి)

తే॥ గీ॥ ఎవడు సచరాచరంబుల – వెల్గుచుండు; ఎవడు లేకున్న తనువిది – యెఱుగ శవమొ
ఎవడు పుట్టించు పాలించు – నెసగ ద్రుంచు; అట్టి సచ్చిత్సుఖాత్మ నీ–వరయు మనస! 76

తే॥ గీ॥ తెలియ బాలున నెయ్యి, మృ–త్తికను ఘటము; మహిని జలమందు మంచు, స–మానముగను
ఎట్లుగలదట్లు పరమాత్మ–యెసగ జగతి; కార్యకారణరూపమై – కలదు మనస! 77

తే॥ గీ॥ కలడో దేవుడు లేడంచు – కలత యేల?; వేదగీతాది శాస్త్రముల్ – వివిధగతుల
కలడు దేవుడు గలడంచు – ఖండితముగ; చాటి చెప్పుచున్నవి – సతము మనస! 78

తే॥ గీ॥ అట్టి వేదోక్తులన్ నమ్మి – యర్థితోడ; కర్మభక్తుల విజ్ఞాన – ధర్మవిధుల
జనక ప్రహ్లాద శుకముని – సజ్జనాళి; ముక్తి బొందరె చిన్నిష్ఠ – మున్ను మనస! 79

తే॥ గీ॥ ఎపుడో జనినట్టి భక్తుల – నిపుడు నమ్మ; నెట్లనగ నీయుగంబున – నెసగియున్న
గోపన, కబీరు, పోతన, – కూర్మి త్యాగ; రాజు ముక్తులుగా లేదె? – రక్తి మనస! 80

తే॥ గీ॥ రామకృష్ణాది భక్తులు – రక్తితోడ; దైవదర్శనమును బొంది – ధన్యులౌచు
మనకు నాదారి జూపంగ – మాన కెపుడు; జాటిన సుబోధలన్ విను – సమత మనస! 81

తే॥ గీ॥ ఏల సందేహ మిక నీకు – నెల్లకాల; మాత్మ నమ్మిక హృదయాన – నంట జేసి
నాస్తికంబును వీడి స–నాతనమగు; బ్రహ్మచింతన జేయు మా – భక్తి మనస! 82

తే॥ గీ॥ కలదె విజ్ఞానమిల జంతు – గణమునకును?; కలిగి యేమాయె నీకది – గర్వమొకటె
తెలివి లేదాయె నీకెంతో – తెలియ జెప్ప; వ్యర్థమొనరించెదవు జన్మ – వసుధ మనస! 83

తే॥ గీ॥ కలదు గాయత్రియందు నోం–కారమరయ; అదియె ప్రణవంబు వేదము–లంత జగము
అదియె బ్రహ్మంబు చేర్చంగ – నాదిమార్గ; మగుటన జపంబు జపియింపు – మర్థి మనస! 84

తే॥ గీ॥ మిథ్య దేహాది జగమిది – తథ్యమరయ; గగనకుసుమంబు జగతిని – గల సుఖంబు
దీని నమ్మక నెప్పుడు – డెంపుచేసి; చింతనము జేయు శ్రీహరి – జేర మనస! 85

తే॥ గీ॥ "దేవ దీనుని గాపాడ – దిక్కు నీవె; వేరె లేరొక్క రీయిల – వెదకిచూడ
భవము బాపుచు నీపాద – భక్తి యొసగి; బ్రోవు"మని వేడు దేవుని – మూఢ మనస! 86

తే॥ గీ॥ జగము ఈశ్వరవ్యాప్తము – జాడ దెలియ; దీన నెయ్యది యాశించి – తిరుగ కీవు
ఈశ్వరార్పిత కర్మల – నెల్ల జేసి; కర్మలంటక నీశ్వరు – గనుము మనస! 87

తే॥ గీ॥ నీదు ప్రీతికి విషయంబు ℊ నిర్మలాత్మ; ప్రీతి విషయాలబోనీక ℊ భీతి తోడ
భక్తి భగవంతు బ్రార్థించి ℊ భవ్యమైన; చిత్తశుద్ధిని దేవుని ℊ జేరు మనస! 88

తే॥ గీ॥ కారణాచార్యు సన్నిధి ℊ గాచికాచి; అలచతుర్విధశుశ్రూష ℊ లాచరించి
తత్త్వమసి వాక్యలక్ష్యార్థ ℊ తత్త్వమెఱిగి; బ్రహ్మమేనని గ్రహియించు ℊ పరము మనస!

తే॥ గీ॥ గురునిబోధల వినకనే ℊ కుదురబోదు; ఆత్మనిశ్చయ మేరికీ ℊ యవనియందు
గాన శ్రీగురుసేవించి ℊ ఘనతమించి; గురువరుని ప్రీతిబడయు మా ℊ కోర్కె మనస! 90

తే॥ గీ॥ దినము వారము పక్షము ℊ దెలియ మాస; మయనములు ఋతువు లబ్దముℊలట్టిమారు
మార దాయాత్మకెప్పుడు ℊ మేర లేదు; నిరుపమానము నిత్యాత్మ ℊ నిజము మనస! 91

తే॥ గీ॥ అహము మొదలుగ దేహంబℊదంతముగను; వాచ్యమా 'త్వం'పదమునకు ℊ వరుసతోడ
వానినెఱిగెడి సాక్షియే ℊ ప్రత్యగాత్మ; లక్ష్యమా'త్వ'ంపదమునకు ℊ లిలిని మనస! 92

తే॥ గీ॥ మాయమొదలుగ జగమంత ℊ మమతదెలియ; తత్పదమునకు వాచ్యంబు ℊ తథ్యమిదియ
జగదధిష్ఠాన బ్రహ్మమే ℊ సమత లక్ష్య;మగును తత్పదమునకని ℊ యరయు మనస! 93

తే॥ గీ॥ వాచ్యములరెంటి పోద్రోచి ℊ వరుసతోడ; లక్ష్యములరెంటి నైక్యంబు ℊ లక్షణమున
జేయు 'నసిపద' మారయ ℊ జీవబ్రహ్మ; లేకమని దెల్పునిది సిద్ధℊమెంతో మనస! 94

తే॥ గీ॥ జీవబ్రహ్మైక్యమీవిధి ℊ జెప్ప గురుడు; తత్త్వమసి వాక్యరూపాన ℊ తాల్మితోడ
ఘనఘటాకాశమే మహాℊకాశమనెడి; వరయుదాహరణంబున ℊ నెఱుగు మనస! 95

తే॥ గీ॥ గురువ గేణ్యునిబోధ నీ ℊ గుర్తుదెలిసి; అదియె నేనాదునని మది ℊ నట్టెనమ్మి
అనవరతమీవు చింతించి ℊ యాత్మనెంతో; సచ్చిదానందబ్రహ్మమై ℊ సాగు మనస! 96

తే॥ గీ॥ యమునికందడు యమహాత ℊ లారయంగ; ఆత్మబట్టుకపోలేరు ℊ అంతమీద
మృత్యువాత్మను దెలియదు ℊ వెదకిపట్టి! అహా! హా!! యెంతటిఘనవస్తుℊవాత్మ మనస!

తే॥ గీ॥ అట్టియాత్మను జేరిన ℊ నంటజాల; వాయముని బాధలేవైన ℊ నందుకొఱకు
సాహసంబున నీజన్మ ℊ సఫలతకయి; పరమపురుషార్థముగడింపు ℊ పరగ మనస! 98

తే॥ గీ॥ చెప్పువారలు నీ కేరు ℊ చెలగియాత్మ; జేరుమార్గంబు నీభువి? ℊ జెఱచువారె!
కారణాచార్యుడే నీకు ℊ కాంక్షజెప్పు; ఆత్మపరమాత్మ వివరంబు ℊ నర్థి మనస! 99

తే॥ గీ॥ ఇది మహాశ్రద్ధ గమనించి ℊ యెంచి యెంచి; జన్మసాఫల్యమొనరింప ℊ జాగుసేయ
కహరహము దైవచింతన ℊ మట్టెచేయు; కంకణముగట్టికొమ్మింక ℊ కఠిన మనస! 100



# రాణి రాస్మణి దేవి

శ్రీ దువ్వూరి రామకృష్ణారావు, బి. ఏ.

(గతసంచిక తరువాయి)

రాస్మణిదేవి మహాభక్తురాలు. కాళికాదేవి యామె కిష్టదేవత. ఈ దేవత నామె ప్రతి నిత్యము గొలుచుచుండెడిది. ఆమె సంస్థాన ముద్రపై గూడ కాళీవిగ్రహము చిత్రింపబడి యుండెను. కాశీయాత్ర జేసి, యా విశ్వేశ్వరుని అన్నపూర్ణను సేవింపవలెనని, చిరకాలము నుండి వాంఛించి, కడపటకు సర్వసంసిద్ధము జేసికొనెను. ఇక మరుసటిదినమున కాశికి పయనమనగా, నాటిరాత్రి కాళికాదేవి రాస్మణిదేవికి కలలో ప్రత్యక్షమై యా కాశీ యాత్ర వదలిపెట్టి, యామెకు గంగానది యొడ్డున దేవాలయ మొకదానిని ప్రతిష్ఠింపు మనియు, నామెచే ప్రతిష్ఠింపబడిన విగ్రహము నందు దాను ప్రత్యక్షముగ వెలసియుండెద ననియు జెప్పెను. మఱికొందఱు రాస్మణి దేవి పడవలపై పయనమై దక్షిణేశ్వర పరిసర ముల నుండగా, నాటిరాత్రి నీకలనుగాంచె నందురు.

అంత తన కాశీయాత్రను మానుకొని, యీ దేవస్థానములను గట్టుటకు దగిన స్థలము గంగానదికి బడమరగల బావి, యుత్తర తీర ప్రాంతములు పవిత్రస్థలములని రాస్మణి ప్రయత్నములు చేసెను. ఈ తావులలో నెంతధన మామె యిచ్చుట కొప్పుకొనినను. నా జమీందారు లామె దేవస్థాన స్థాపనకు నొప్పుకొనలేదు సరిగదా, గంగానది కచ్చట మెట్లను గట్టుటకైన నంగీకరింపరైరి. ఇంతలో 1847–వ సంవత్సరమున గలకత్తాకు నాల్గు మైళ్లదూరమున దక్షిణేశ్వరమునం దిరువది యెకరములవిస్తీర్ణముగలనేలను "హేస్టి" యను కలకత్తా యున్నతన్యాయస్థాన న్యాయవాది యొద్ద నామె కొనెను. దీనిలో విశేష ద్రవ్యమును ఖర్చుపెట్టి యెనిమిది సంవత్సరములకు బ్రస్తుతమున వెలసియున్న దక్షిణేశ్వర దేవాలయమును కట్టించెను. శ్రీ రామకృష్ణులు చెప్పినటుల నీ స్థలము వ్యెత్తున కూర్మపృష్ఠాకారముగానుండుటయేగాక, యీ కట్టడముల కట్టినట్టి సమయమున కది విసర్జింపబడిన తురుష్కుల గోరీదిబ్బలతో నిండి, శాస్త్రానుగుణముగ శక్తిపూజకు తగు లక్షణములు గలిగి యుండెను.

రాస్మణిదేవి చాలధనమును వెచ్చించి గంగవరకు నీస్థలమున్నందున గంగయొడ్డున సోపానములను కట్టించెను. పడవపై దిగువారీ మెట్లపై నెక్కినచో 12 శివాలయముల నుత్తరదక్షిణములుగా నిర్మింపబడినవిగాంతురు. వీటిమధ్యనుండు సింహద్వారముగుండ ప్రవేశించినచో. నీ శివాలయములకు దూరున

నొక దేవాలయముచుట్టునునుండు రాతి చప్టా మీదకు ప్రవేశముగలుగును. ఈ చుట్టునుండు చప్టానదను రాధాగోవిందుల దేవళమును, భవ తారిణియను కాళికాదేవ్యాలయమునుగలవు. కాళికాదేవ్యాలయము ప్రవేశింప నంతలి రమణీయమగు వేయి వెండి రేకులుగల పద్మముపై, శవాకారముగ బడియున్న శివుని వక్షస్థలమున, నతిసుందరమగు నల్లరాతిపై చెక్కబడిన భవ తారిణియను కాళికావిగ్రహముగలదు. ఈమె బనారసు పట్టుచీరను ధరియించి, మంచి మంచి యాభరణములతో నలంకరింపబడి దక్షిణాభి ముఖిగ విరాజిల్లుచున్నది. ఈ దేవాలయము నకు తొమ్మిది గోపురములు గలవు.

ఈ దేవాలయమున కెదుట నాట్యమంది రము గలదు. ఈ మంటపమున కుత్తర దక్షిణ దిక్కులలో వాసగ్రాసములకై గదులు కట్ట బడెను. ఈ మంటపమున కీశాన్యమున శివా లయముల జేర్చి యుత్తరమున నొక వీథిగది గలదు. ఇందు శ్రీరామకృష్ణులు దక్షిణేశ్వ రమునందున్నంతకాలము వసియించువారు. ఈగది వసారానుండి శ్రీరామకృష్ణులు గంగా నదిని జూచుచు నానందించుచుండెడివారు. ఈ దేవాలయమున కుత్తరమున రాస్మణిదేవి వనవిహార భవనమ్ముగలదు. ఇచ్చటగల యా రామమునం దనేకములగు చెట్లు చేమలు, పూలమొక్కలు, పొదరిండ్లు, రెండు తటాక ములు గలవు. ఈ భవనమున కుత్తరమున శ్రీరామకృష్ణులు తమ సాధనకై యేర్పాట్లు గావించుకొనిన పంచవటియను నొక మహా వటవృక్షమును, దీనికుత్తరమున దేవాల యాంత్యభాగమున నొక బిల్వవృక్షమును గలవు. ఈ స్థలములు శ్రీరామకృష్ణులు సాధన చేసిన స్థలములగాన పవిత్రములయినవి.

రాణిరాస్మణి దేవతావిగ్రహము చెక్కింప నారంభించిన నాటనుండియు నామె జీవితము నాహార, నిద్రాదుల యందు కఠినమైన నియమ ముల బూనియుండి, జపతపముల జేయుచుం డెను. కాళీవిగ్రహము తయారై దానిని మంచి ముహూర్తమున నెలకొల్పవలెనని చూ చుచుండ దేవాలయప్రతిష్ఠ ఆలస్యమగు చుండెను. ఈ కాళీవిగ్రహ మొక పెట్టెలో తాళమువేయబడియుండెను. తెలియరాని కారణాంతరమున ఆ విగ్రహము బూజు పట్టు టయు, పెట్టెలోనింక నిర్బంధములో నుండ జాలననియు, శీఘ్రముగ దన ప్రతిష్ఠను జరి పింపుమనియు రాస్మణికి కలలో కాళిదర్శనమిచ్చి తన యాదేశము నామెకు తెలియజెప్పెను. అందువలన విష్ణుపూజకేగాని శక్తిపూజ కంత యెక్కువ యుచితముగాని దైనను కాళికా దేవి ప్రతిష్ఠాపనకు 1855–వ సంవత్సరము మే 31–వ తేదీ పౌర్ణమిదినమున ఆ దక్షిణేశ్వర దేవాలయ సంప్రోక్షణ ముహూర్తము నిశ్చ యింపబడినది. అంతయు సర్వసిద్ధమైనది. ఇక దేవతాప్రతిష్ఠజరిగి, జగజ్జనని ఆ దేవళమున వెలయునని రాస్మణి మనంబుప్పొంగ సంబరము పడుచుండ, అనుకొనని యవాంతరము కలిగి యామె యాసలన్నియు నడియాసలై భగ్నము లగునటుల గనబడెను.

రాణిరాస్మణి శూద్రజాతిస్త్రీ, శూద్రపౌరో హిత్యమును జేయుట, ఆమె ప్రతిష్ఠించెడి దేవా లయ ప్రసాదమును బ్రాహ్మణులు గైకొనుట ఆచార విరుద్ధమన్న శంక అడ్డు తగిలెను. ఈ సందర్భమున రాస్మణికేమియు దోపలేదు. ఇంతేకాక దేవాలయమును బ్రాహ్మణులకు దానమిచ్చుట కాలోచించినను, అట్టి ప్రతి

గ్రహించిను బ్రాహ్మణకులమున జాల హీనునిగ జూతురు. ఈ యిబ్బందివలన గాళికా దేవ్యాలయ ప్రతిష్ఠ కవరోధము గలుగుటయేగాక, కాళికా దేవి కన్నభోగమిడి, ఆ ప్రసాదము నందరును స్వీకరింపవలెనను రాస్మణి యభీ [illegible] లగు బ్రాహ్మణు లియ్యకొనరైరి.

కాని రాస్మణీదేవి తనపట్టును విడువదయ్యె. ధైర్యముగలదియై యెన్ని యవరోధములు కలిగినను వానిని లెక్కచేయక, శాస్త్రసమ్మతము నుగుఱించి పండితులకు జాబులు వ్రాయించెను. ఒక్కజాబైనను రాస్మణి కనుకూలముగ గనబడలేదు. ఇట్లుండ ఝామాపకూర్ పాఠశాల పండితుడును, శ్రీ రామకృష్ణుల కన్నగారగు రామకుమారులు కాళికా దేవ్యాలయమును, దాని నిర్వహణమునకు గావలెసిన ధనమును నొక బ్రాహ్మణునకు దానపత్రమును వ్రాసియిచ్చినచో, నప్పుడు రాస్మణి యభీష్టము శాస్త్రసమ్మతమగుననియు, ఆ ప్రతిగ్రహణము వలనగాని, ఆ ప్రసాదమును పుచ్చుకొనుటవలనగాని బ్రాహ్మణుల కాక్షేపణ లేదనియు వ్రాసెను. అంతమాత్రముచే నవరోధము తీరలేదు. ఛాందస బ్రాహ్మణులీయాచారమున లేని పద్ధతికి నొప్పుకొనరు సరిగదా, ఆలయమున నర్చకపదవి నంగీకరించుటకు సద్బ్రాహ్మణున కుచితముగాదని, జన్మజన్మకు నభిలషింపరానిదనియు లోలోన గుసగుసలు ప్రారంభమైనవి. తనయింటి పురోహితులు సరియగు పండితులు కారనియు, గాళికా దేవిపూజ లొనర్చుటకు సమర్థులు కారనియు, నాగుణవతికి తెలియును. కాన సరియగు శక్తి, సామర్థ్యములు, భక్తి, పవిత్రతలుగల బుద్ధిమంతుడగు నర్చకునకై యామె యెదురుచూచుచుండెను.

రాస్మణీదేవి తనకొలువుకూటమునందలి సిహోరి గ్రామవాసియగు మహేశచంద్రఛటర్జీ యను నతని దేవాలయసిబ్బంది నేర్పాటు [illegible] యగు క్షేత్రనాథుని రాధాకాంత దేవాలయ కర్చకునిగా నియమించెను. ఇక కాళికా దేవ్యాలయమునకు సరియగు నర్చకుని నియోగించుట కాలోచించుచు, సరియగువారు కుదరనందున శ్రీ రామకృష్ణులయన్నగారును, దన స్వగ్రామమగు సిహోరి ప్రాంతస్థ గ్రామవాసియనగు రామకుమారుడనే తాను నియమించుట యన్నివిధముల శ్రేయోదాయకమని, రాస్మణి కాసంగతిని దెలియబరచి, యామె అంగీకారము నుబడసి, యాస్థాన మంగీకరింప వారిని బ్రోత్సహించుటకు తాను స్వయముగ రామకుమారునియొద్దకేగి, రాణిరాస్మణిహృదయ మాతని కెరింగించెను. రామకుమారుడిట్టి దేవతాకార్యమున కాటంకముతొలగనున్న దనియు, సుముహూర్తము దగ్గరకు నచ్చిన దనియు, రాణిరాస్మణికి దనయందుగల భక్తి గౌరవప్రపత్తులు, ఆదరాతిశయములు, ఆమె యౌదార్యము వీనికి మెచ్చి, సరియగు నర్చకుడు కుదురువరకు దానా కార్యభారమును వహించుట కొప్పుకొనెను. ఈశ్వరవిలాసము వలన, రాస్మణియు, మథురబాబును దనయెడల జూపుచుండిన గౌరవాతిశయములకు జాల సంతసించి, ఆ దేవతాలయమునకును దన కునుగల సంబంధములను విడువజాలక తన జీవితాంతమువరకు రామకుమారుడా దేవాలయమున నర్చకుడుగనే, తన జీవితమును గడపెను.

ముహూర్తబలమువలన నవరోధములన్నియు దీరుటచే, దేవాలయసంప్రోక్షణ మతివైభవముగ జరిగెను. ఆ సమయమున నా దివ్యక్షేత్రమున నెచ్చట జూచిన భజనలు, భక్తితరంగములు, నాటకప్రదర్శనములు, బురాణగోష్ఠులు ప్రతిధ్వనించెను. దీపాలంకరణములతో అస్థలమెంతయో దేదీప్యమానముగ వెలింగెను. వేనవేలు సంభావింపబడిరి. బీదల కన్నప్రదానము జరిగెను. విద్వాంసులుచితరీతిని సత్కరింపబడిరి. ఈ దేవతాలయ నిర్మాణములకు, నుత్సవములకు దొమ్మిదిలక్షల రూపాయలు రాస్మణి ఖర్చుపెట్టెను. ఇంతే కాక త్రైలోక్యనాథఠాకూర్ (టాగోరు కుటుంబము) వద్ద రెండులక్షల యిరువదియారువేలకు దినాజపూర్ జిల్లాలోని యొక జమీందారిని గొని, రాణిరాస్మణిదేవి చనిపోవుటకు బూర్వమీ జమీందారివలన వచ్చురాబడిని కాళికాలయ పోషణమునకై దానపత్ర పూర్వకముగ వ్రాసియిచ్చెను.

ఇట్లెంతయో శోభగా దేవదానవులు దుందుభులుమ్రోయ దేవతాలయముల ప్రతిష్ఠ జరిగినది. రాస్మణీదేవి కలలోగాంచినటులనే, ఆచక్కని రాతివిగ్రహమునందాయంబ ఆవహించి, చైతన్యశక్తిగను, సజీవముగను దక్షిణేశ్వరమున విరాజిల్లుచున్నది. రాస్మణికోరిక ఫలించి, హృదయము మహదానందము నొందినది. ఆమె గొప్పభక్తి, ఆ దానములు, సమర్థుడైన పూజారిగాబోవు శ్రీ రామకృష్ణుల గాఢమగు భక్తితత్పరతయు జూచి త్వరలో నామృణ్మయ చిన్మయుగ, సజీవగ నలరారజొచ్చెను. నాటినుండియు దక్షిణేశ్వరాలయమనేకులకు శాంతిదాయినియైనది. అది అపవిత్ర వాతావరణముతో, ఏకాంతమైన పొదరింప్లతో నారామములతో, ఆప్రక్కన పావన గంగానదీ ప్రవాహముతో కలకలలాడుచుండెను. అన్నింటిని మించినది యానర - నారాయణస్వరూపియగు శ్రీరామకృష్ణు లచ్చట తపంబొనర్చుచు నివసించుటచే, వారిదీవనల నందుటచే ఆ దేవతాలయమొక దివ్యక్షేత్రమై, యభినివేశముగల ధ్యానపరులగు వేనవేల భక్తులకు హితమైన యాశ్రమముగ నేర్పడినది. ఇప్పటికి ఆ దేవాలయగోపురములను, అచ్చటి వృక్షశిఖరములను బడవవాండ్రు క్రొత్తవారికి రాణిరాస్మణి యొక్క పవిత్ర శీలమునకు స్మారక చిహ్నముగ జూపుదురు. యాత్రికులాదివ్యమాతకు, గర్భగుడియొద్ద భక్తిపరవశులై శిరస్సుల మొగ్గుదురు.

(సశేషము)



# శ్రీ వాసుదేవ మననము

## ద్వితీయ వర్ణకము

శ్రీ మాచిరాజు శ్రీరామకృష్ణ

(గతసంచిక తరువాయి)

"ఏతత్తత్త్వజ్ఞానప్రదాయకం గురుమీశ్వరమేవ విద్యాత్॥" ఈ తత్త్వవిజ్ఞానప్రదాతయైన సద్గురుని సాక్షాదాదినారాయణునిగనే గ్రహించవలయును. "గురుస్సాక్షాదాదినారాయణః పురుషః" (మ. నా. ఉ. 8 అ.) పురుషోత్తముడైన ఆదినారాయణుడే విహితాచార్యుడని శ్రుతి. "శివశక్తి సమాయోగాత్ జన్మాంతర కృతాచ్ఛుభాత్। శివరూపానుచింతాస్యాత్ కర్మనాశో యదా భవేత్। శివ ఏవ తదా సాక్షాత్ ఆస్థాయ గురువిగ్రహం। దీక్షాం కరోతి విశ్వాత్మా శంభు శక్త్యా త్వవేక్షతే॥" జన్మానేకశతసహస్రకృతసుకృతపరిపాకముచేత శివశక్త్యైక్యజ్ఞాన మంకురించును. "శివశక్త్యాత్మకం రూపం చిన్మయానంద వేదితం॥" (పా. బ్ర. ఉ. 4.) శివశక్తులనెడి యుభయముగనైన రూపము చిన్మయానంద స్వరూపముగ తెలియవలయునని పాశుపత బ్రహ్మోపనిషద్వచనము. "పరమాత్మా శివః ప్రోక్తః శివా సైవ ప్రకీర్తితా॥" (లింగ. పు.) శివశక్తులు చంద్రచంద్రికల చందమున అద్వితీయాఖండైకరసస్వరూపమగు పరమాత్మయే. ఆ పరబ్రహ్మవస్తువే 'శివః' అనియు 'శివా' అనియు పేర్కొనబడుచున్నది. అద్వితీయాఖండైకరస పరబ్రహ్మచైతన్యము మాయయందు ప్రతిబింబించి ఈశ్వరసంజ్ఞను పొందినట్లు బింబప్రతిబింబ భావముచేత చిత్తే శక్తియనదగును. చంద్రచంద్రికలకువలె బ్రహ్మమునకును శక్తికిని భేదములేదు. "శైవ శాక్త పురాణేషు వేదేషు వేదాంతేషు చ చిదేవ శక్తిరితిగృహ్యతే॥" శైవములు శాక్తములునైన సకలపురాణములయందును, వేదములయందును వేదాంతములయందును చిత్తే శక్తి యని గ్రహింపబడుచున్నది. "చైతన్యస్వరూపాచిచ్ఛక్తిః॥" (గా. పాద. సూ. 3.) 'చైతన్యస్య బ్రహ్మణః స్వరూపాచిత్ శక్తి స్సామర్థ్యం। ఇతి శ్రీవిద్యారణ్యభాష్యే॥' విశుద్ధబ్రహ్మస్వరూపమే చిత్, శక్తి యనగ సామర్థ్యము. ఆ చిత్తు ప్రకాశరూపముతోను శక్తిస్వరూపముతోను ఉన్నదని శ్రీవిద్యారణ్యభాష్యము. "అవిద్యాకృతదేహాది సంఘాతే ప్రతిబింబితా। చిచ్ఛక్తిర్జీవలోకేఽస్మిన్ జీవఇత్యభిధీయతే॥" (అధ్యాత్మ రామాయణము. 1-7-34.) అవిద్యాకార్య

మైన దేహేంద్రియాది సమూహమునందు ప్రతిబింబించిన చిచ్ఛక్తియే యీ జీవలోకమునందు జీవుడని పేర్కొనబడుచున్నది అని శ్రుతిస్మృతిపురాణప్రసిద్ధము. అట్టి పరబ్రహ్మస్వరూపమును నిరంతర మనుచింతనము చేయుటవలన ఎపుడు కర్మవినాశము (ఇచట కర్మవినాశమన చిత్తనైర్మల్యము గ్రాహ్యము) కలుగునో అపుడు శివశక్త్యైక్యస్వరూప చిన్మయానంద పరబ్రహ్మమే సద్గురురూపమున ప్రత్యక్షమై స్వశక్తిని శిష్యుని చిత్తమునందు ప్రసరింపజేసి స్వాత్మతత్త్వము నవగత మొనరించును. "ప్రసాదకారిణీ స్వచ్ఛాని రచ్ఛే విమలాకృతౌ। తైలబిందు రివాదర్శే విశ్రామ్యత్యుపదేశవాక్॥" (జ్ఞానవాశిష్ఠము. 6-43-98.) అటువంటి సద్గురునిచేత నుపదేశింపబడిన స్వభావనిర్మలమైన ప్రసాదకారిణియైన అనగా సంసారసమూలనిర్మూలనమును, స్వాత్మవిజ్ఞానమును, పునస్సంసారావసాదనమును జేయునదియైన బ్రహ్మవిద్య, అకామహతుడు శ్రోత్రియుడు నగు శిష్యుని వినిర్మలచిత్తమునందు, దర్పణమునందు తైలబిందువు చందమున విశ్రమించును - స్థైర్యమునొందును. "తస్య ప్రసాదయుక్తస్య విద్యా వేదాంతవాక్యజా। దహత్యవిద్యా మఖిలం తమ స్సూర్యోదయే యథా॥" (సూతసంహిత.) అట్టి ఆచార్యుని అనుగ్రహమువలన గలిగిన వేదాంతశ్రవణాదికముచే నుపలబ్ధమైన బ్రహ్మవిద్య, అరుణోదయము అంధకారమునువలె, శిష్యుని అవిద్యను నిశ్శేషముగ నశింపజేయును. "సద్గురోః ప్రసాదేఽస్య ప్రతిబంధక్షయః తతః। దుర్భావనా తిరస్కారా ద్విజ్ఞానం ముక్తిదం క్షణాత్॥" అటువంటి సద్గురుప్రసాదము - సద్గురూపదిష్ట స్వాత్మవిజ్ఞానమువలన ఇటువంటి శిష్యుని యొక్క ప్రతిబంధకత్రయమును బీజముసహా ప్రలయమునొందును. అంతట దుర్భావన - ద్వైతప్రతీతి - తిరస్కృతమగుటవలన తత్క్షణమే అపవర్గప్రదమైన అప్రతిబద్ధాత్మవిజ్ఞానమధిగతమగును. "గుణత్రయ మతీతం స్యాద్గ్రంథిత్రయ విభేదనాత్। శివశక్తి సమాయోగే జాయతే పరమాస్థితిః॥" (యోగశిఖ. ఉ. 1-116.) అవిద్యాగ్రంథిత్రయవిభేదనము-విదారణమువలన, గుణత్రయమును అనగా త్రిగుణాత్మికమైన మాయను, అతిక్రమించినదియైన శివశక్తిసమాయోగమున ఉత్కృష్టమైన స్వభావైక నిష్ఠత్వము సిద్ధించును. "యథా గురు స్తథై వేశో యథై వేశ స్తథా గురుః। పూజనీయో మహాభక్త్యా న భేదో విద్యతేఽనయోః॥" (యోగశిఖ. ఉ. 5-58.) సర్వేశ్వరుడే సద్గురుడు. సద్గురుడే సర్వేశ్వరుడు. ఉభయులకు భేదములేదు. అట్లగుట సర్వేశ్వరునివలెనే సద్గురుని పరమభక్తితో పూజసేయుడు. "యస్య సాక్షాద్భగవతి జ్ఞానప్రదీప ప్రదే గురౌ। మర్త్యాసద్ధీః శ్రుతం తస్య సర్వం కుంజర శౌచవత్॥" (భాగ. 7-15-26.) సాక్షాత్తుగ సేవింపదగిన స్వాత్మజ్ఞానప్రదీపమును ప్రసాదించిన (అనుగ్రహించి యిచ్చిన) నిజసద్గురునియందు మనుష్యుడనెడి దుర్బుద్ధిగల అంతేవాసియొక్క అధీతవేదాంతశ్రవణాదికము సర్వము సామజస్నానమువలె వ్యర్థమగును. అనగా శుచ్యర్థమైన కుంజరశౌచము (స్నానము) పునర్ధూళిప్రక్షేపణముచేత నిష్ఫలమగుచున్న చందమున నే బ్రహ్మజ్ఞానమును ప్రసాదించిన సాక్షాత్పరమేశ్వరుడైన సద్గురునియందు మనుష్యుడని దుర్బుద్ధింజేయు శిష్యునియొక్క అధీతవిద్యయంతయు విఫలమగును. "క॥ హరిమహిమ దనకు జెప్పిన। గురువున్ నరుడనుచు దలచి

కాంక్షితభక్తిన్। దరుగు బురుషుశ్రమమెల్లను। గరిశౌచముక్రియ నిరర్థకంబగు నధిపా॥'' అని భాగవతవచనము. "నరే రుష్టే నృపస్త్రాతా నృపే రుష్టే హరిస్తథా। హరౌ రుష్టే గురుస్త్రాతా గురౌ రుష్టే న కశ్చన॥'' మనుజునకు కోపమువచ్చిన మానవపతి సంరక్షించును. భూపతికి కోపమువచ్చిన భగవంతుడు సంరక్షించును. భగవంతునికి కోపమువచ్చిన పరిపాలింప దక్షుడు సద్గురుడే యగుటంజేసి సద్గురుడు సంరక్షించును; సద్గురునకు ఆగ్రహము గలిగినచో సంరక్షింపగల సమర్థుడెవ్వడును లేడు. కనుక సద్గురుని ఎన్నడును లాఘవపఱచ కూడదు, తిరస్కరింపదగదు. "లబ్ధ్వానుగురుం సమ్యక్ న గుర్వంతరమాశ్రయేత్॥'' బ్రహ్మవిద్గురుని బడసి యన్యగురుని ఆశ్రయింపజనదు అని విధివచనము. ఇటువంటి సద్గురుముఖమున వేదాంతశ్రవణమనననిదిధ్యాసనాభ్యాస మూలమున స్వాత్మతత్త్వమును - జీవాత్మపరమాత్మలయొక్క అభేదమును-విచారణచేసి తెలిసికొనిన మహాత్ముడే ముక్తినిపొందుచున్నాడని సిద్ధము.

# తృతీయవర్ణకము

ఈ ప్రపంచము ఎన్నివిధములు? అనిన ఈ ప్రపంచము ఆత్మయనియు అనాత్మయనియు రెండుప్రకారములు. ఆత్మ ప్రపంచాతీతము గదా! అట్టి ప్రపంచాతీతమైన ఆత్మకు ప్రపంచాంతర్భావత్వ మెటుల గలుగునని శంకింప దగదు. అనగా ప్రపంచముకంటె విలక్షణమైన ఆత్మప్రపంచమునం దెటుల మిళితమై యుండునని సంశయింప బనిలేదు. ఏలయన నీ ప్రపంచము చేతనాచేతనాత్మకమగుటవలన, ఆత్మ చేతనరూపమగుటవలన ఆత్మ వినాగా ప్రపంచమునకు సత్త (ఉనికి) యే లేకపోవుటవలన ఆత్మకు ప్రపంచాంతర్భావము చెప్పదగినదే. ఇందుకు ప్రమాణము.—"ఈశావాస్యమిదగ్ం సర్వం యత్కించ జగత్యాం జగత్॥'' (ఈశా. ఉ. 1.) స్థావరజంగమాత్మకమైన సమస్తప్రపంచము సర్వపరిపూర్ణుడును ప్రత్యగాత్మస్వరూపుడు నగు పరమాత్మచేత వ్యాపింపబడియున్నది. ఆత్మావాస్యముకాని జగద్భాగము కించిత్తైనను లేదు. "యస్మాత్పరంనా పరమస్తి కించిద్యస్మాన్నాణీయో న జ్యాయోఽస్తికశ్చిత్। వృక్షఇవ స్తబ్ధో దివితిష్ఠత్యేక స్తేనేదం పూర్ణం పురుషేణ సర్వమ్॥'' (తై. ఉ. 4-12-13.) ఏ బ్రహ్మచైతన్యముకంటె శ్రేష్ఠమైనట్టిగాని లేక హీనమైనట్టిగాని మఱియొక వస్తువు కొంచెమైనను లేదో, ఏ పరబ్రహ్మతత్త్వముకంటె సూక్ష్మమైనట్టిగాని లేక స్థూలమైనట్టిగాని వస్త్వంతర మొక్కటియు లేదో అట్టి చిదేకరసాత్మకుడగు పరమాత్మ స్వప్రకాశమునందు గమనాగమన విహీనమైన వృక్షమువలె నిశ్చలుడై నిలిచి యుండును. ఆ పురుషునిచేత ('పూర్ణత్వాత్పురుషః' = పూర్ణుడై యుండుటవలన పరమాత్మ పురుషశబ్దవాచ్యుడు) నీ ప్రపంచమంతయు పరిపూర్ణముగ వ్యాపింపబడియున్నది. "ఆభారూపస్యవిశ్వస్య భానం భాసన్నిధేర్వినా కదాచిన్నావకల్పేత। భాచాహం తేనసర్వగః॥'' (అద్వైతమకరందము.) ఆభారూపస్యవిశ్వస్య = చిదాత్మవిలక్షణమైన జడజగత్తుయొక్క, భానం = ప్రకాశము, భాసన్నిధేర్వినా = కేవల

తేజస్సైన ఆత్మసాన్నిధ్యమువినాగా, కదా చిత్-న-అవకల్ప్యేత = ఒకప్పుడును కలిగింపబడదు, లేదని యర్థము. భా-చ-అహం = ఆ తేజస్సే నేను, తేనసర్వగః = ఆ హేతువుచే సర్వవ్యాపకుడను. "న తత్రసూర్యోభాతి న చంద్రతారకం। నేమావిద్యుతోభాంతి కుతో ఉయమగ్నిః। తమేవభాంత మనుభాతిసర్వం। తస్యభాసా సర్వమిదం విభాతి॥" (కఠ. ఉ. 2-2-15.) సర్వాత్మభూతుడైన పరబ్రహ్మమును సర్వావభాసకుడైన (సర్వమును ప్రకాశింపజేయునట్టి) సూర్యుడు ప్రకాశింపజేయజాలడు. అట్లే చంద్రుడుగాని, నక్షత్రములుగాని, ఈ మెఱుపులుగాని ఆత్మను ప్రకాశింపజేయ సమర్థములుగావు. ఈ యగ్నియు ఆత్మను ప్రకాశింపజేయనేరదు. సూర్యచంద్రాదిరూపమున ప్రకాశించుచున్న ప్రపంచమంతయు అలుప్త స్వయం ప్రకాశస్వరూపమైన పరబ్రహ్మము యొక్క ప్రకాశము ననుసరించియే ప్రకాశించుచున్నది. ఈ సకలప్రపంచము ఆ పరమాత్మ ప్రకాశము చేతనే ప్రకాశించుచున్నది. "వ్యక్తా వ్యక్తం భరతే విశ్వమీశః॥" (నారదపరివ్రాజిక. ఉ. 9-7.) ఆత్మ, వ్యక్తము అవ్యక్తమునైన లోకత్రయము నావేశించి భరించుచున్నాడు. అనగా 'లోక్యంతే దృశ్యంతే ఇతిలోకాః' = చూడబడునవి గాన స్వాభిమానులు-అవస్థలు-భోగ్యవిషయములు సహా సమష్టి వ్యష్టిరూపములుగా నుండు స్థూల-సూక్ష్మ-కారణశరీరములు లోకములనబడును. వీనియొక్క త్రయము లోకత్రయ మనబడును. అట్టి లోకత్రయమును బాహ్యాంతరములయందంతట పరిపూర్ణముగ ఆత్మ యధిష్ఠించి వానికి సత్తను స్ఫూర్తిని గలుగజేయుచు ధారకుడు పోషకుడు ప్రకాశకుడు నగుచున్నాడు. "తదేజతి తన్నైజతి తద్దూరే తద్వంతికే। తదంతరస్య సర్వస్య తదు సర్వస్యాస్య బాహ్యతః॥" (ఈశా. ఉ. 5.) తత్ ఏజతి=చేతనరూపమైన ఆ యాత్మవస్తువు, సగుణధ్యానముకొఱకు ఏర్పాటుచేయబడిన మాయోపాధికులగు బ్రహ్మ విష్ణు మహేశ్వరాదులను, అవిద్యోపాధికులగు జీవులను, స్థావర జంగమ వస్తువులను, కనకమునందు కటక మకుటాదులవలె నని తెలియని తత్త్వవిచారణాశూన్యులగు నవివేకులకు చలించుచున్నదిగా నున్నది. తత్ నైజతి = చేతనరూపమైన ఆ యాత్మవస్తువు. "బ్రహ్మైవాహమిదం జగచ్చ సకలం చిన్మాత్ర విస్తారితం। సర్వంచైతదవిద్యయా త్రిగుణయాసేశం మయాకల్పితం। ఇత్థం యస్య దృఢామతి స్సుఖతరే నిత్యేపరే నిర్మలే। చండాలోస్తు సతుద్విజోస్తు గురు రిత్యేషా మనీషా మమ॥" (శ్రీ శంకరాచార్యః.) పరబ్రహ్మమే నేను. ఈ సమస్తమైన ప్రపంచము నాయందు వివర్తముగా విస్తృతమైనదే యగుటచే స్వాత్మయైన చిన్మాత్రమే. జీవేశ్వరులతోసహా సకలప్రపంచము త్రిగుణాత్మికయైన మూలప్రకృతిచేతం గల్పితమై నాయం దారోపింపబడుచున్నది. ఇట్లు దృఢనిశ్చయబుద్ధి, నిత్యము పరము నిర్మలము నిరతిశయసుఖరూపమునైన స్వాత్మయం దెవనికి గలుగునో ఆ మహాత్ముడు అంత్యజుడు (చండాలుడు) గానీ - అగ్రజుడు (బ్రాహ్మణుడు) గానీ అతడే సర్వజగద్గురుడైన సచ్చిదానంద పరబ్రహ్మమని నా బుద్ధి నిశ్చయము" - అను శ్రీ శంకరాచార్య వచనమునుబట్టి - సమస్తము నాత్మస్వరూపమే యని తత్త్వవిచారణద్వారా స్వానుభవజ్ఞులైన జ్ఞానులకు చలింపనిది యగును. తత్ దూరే=చేతనరూపమైన ఆ యాత్మవస్తువు, కామక్రోధాదులచే ఘనముగ నావృతమై

యుండు భేదబుద్ధిగల అవివేకు లనంతకోట్లకల్ప ములకైనను స్వాత్మతత్త్వమును తెలిసికొనుదు రనునది లేదు గావున వారల కత్యంతదూర ముగనున్నది. తత్ + ఉ=తద్వత్, అంతికే= ఆ ప్రకారముగనే సాధనచతుష్టయసంపన్నులై సద్గురూపదిష్టముగ వేదాంతశ్రవణాదికముచే నుపలబ్ధమైన ఆత్మజ్ఞాననిష్ఠాగరిష్ఠులైన స్వాత్మ తత్త్వజ్ఞుల కత్యంతసమీపముగ నున్నది. అనగా.—"కాశీక్షేత్రం శరీరం త్రిభువన భవన వ్యాపినీ జ్ఞానగంగా। శ్రద్ధాభక్తిర్గయేయం నిజ గురుచరణధ్యానయోగః ప్రయాగః। విశ్వే శోఽయం తురీయం సకలజన మనస్సాక్షిభూతో న్తరాత్మా। దేహే సర్వం మదీయే దివసతి పునస్తీర్థమన్యత్కిమస్తి॥" శరీరమే కాశీ క్షేత్రము. లోకత్రయమునందు వ్యాపించి యున్న జ్ఞానమె గంగాతరంగిణి. శ్రద్ధోపేత మైన భక్తియె గయాక్షేత్రము. నిజసద్గురుపద ధ్యానయోగమె ప్రయాగక్షేత్రము. కాశీ విశ్వేశ్వరుడె తురీయమైన సకలజన మనస్సాక్షి భూతమగు అంతరాత్మ. ఇట్లు సర్వము నా దేహమునందే యుండగా నిక నన్యమైన తీర్థ మేమున్నది? మఱియు "కాశాంహి కాశతే కాశీ। కాశీ సర్వప్రకాశికా। సా కాశీ విదితా యేన। తేన ప్రాప్తాహి కాశికా॥" 'కాశృ దీప్తౌ' అనెడి ధాత్వర్థము ననుసరించి కాశీ యన 'కాశత ఇతి కాశీ' = స్వప్రకాశమాన మగు చిన్మాత్రజ్యోతి – నిరంతరప్రకాశస్వరూప పరమాత్మ. అట్టి చిదాత్మ – ప్రత్యగాత్మ – స్వప్రకాశమునందే స్వయముగ ప్రకాశించు చున్నది. స్వారోపిత జడప్రపంచమునంతను ప్రకాశింపజేయుచున్నది. స్వస్వరూపమైన యీ కాశీ సాక్షాత్తుగనే మహాత్మునిచే నెఱుంగ బడునో ఆ మహాత్మునిచేతనే స్వాత్మమైన కాశీ ప్రాప్తమగుచున్నది. అను శ్రీ శంకరాచార్య వచనానుసారముగా అంతర్యామిరూపముగ నంతట నిండియుండు పరమాత్మయె తనలోను అంతర్యామిగ నున్నాడని స్వాభిన్నముగ ఆత్మ సాక్షాత్కారమును బొందిన బ్రహ్మవిదులకు, స్వరూపభూతమె యగుటంజేసి యత్యంతసమీ పముగ నున్నది. తత్ = చేతనరూపమైన ఆ యాత్మవస్తువు, అస్య సర్వస్య అంతరః=చరా చరాత్మకమగు నీ సమస్తప్రపంచముయొక్క లోపల విజ్ఞాన ఘనస్వరూపమగు నంతర్యామి గాను, తత్ = ఆచేతనరూపమైన ఆత్మవస్తువు, అస్య సర్వస్య బాహ్యతః = నామరూపక్రియా త్మకమగు సమస్త జగత్తునకు వెలుపల దశ దిశలయందును, సర్వపరిపూర్ణమైయున్నది. "తస్మా దన్యోన్య మాశ్రిత్య హ్యోతం ప్రోత మనుక్రమాత్। పంచభూత మయీ భూమిః సాచేతన సమన్వితా॥" (త్రిశిఖిబ్రాహ్మణ. ఉ. 4.) అందువలన ఓతప్రోతానుక్రమమున చేతనాచేతనములు అన్యోన్యాశ్రితములుగ వర్తించుచుండుటంజేసియే పంచభూతాత్మక మగు సర్వజగత్తు ఆచేతనరూపాత్మసమన్వి తమే. అను నిత్యాది శ్రుతి స్మృతులన్నియు ఆత్మయొక్క ప్రపంచాంతర్భూతత్వమును సిద్ధాంతీకరించుటంజేసి ఆత్మయొక్క ప్రపం చాంతర్భావము చెప్పదగినదే.

శిష్యుడు:—స్వామీ! అట్లయిన చేతన మెయ్యది? అచేతన మెయ్యది?

గురువు:—వత్సా! జంగమము సర్వము చేతనము. స్థావరము సర్వము అచేతనము.

శి:—స్వామీ! అట్లయిన చేతనాచేతన ములు ప్రత్యేక మనేక ప్రకారములుగ ప్రకా శించుచుండ ప్రపంచము రెండువిధములే అని యెదరేమి?

గు:—వత్సా! వినుము. అనాత్మరూపము ఒక్కటియె. అది కార్యరూపమున అనేక రూపములయినది. ఆత్మరూపమును ఒక్కటియె. "ఏక మేవా ద్వితీయం బ్రహ్మ॥" (మ. నా. ఉ. 3 అ.) బ్రహ్మము స్వగతభేద శూన్యముగ నేకము. సజాతీయ విజాతీయభేద శూన్యముగ నద్వితీయమునై యున్నదని శ్రుతి. ఆ యాత్మయె అనాత్మకార్యోపాధులయందుప హితమై యుండుటవలన నా యుపాధులచేత ననేక జీవులుగను అనేక ఈశ్వరులుగను ప్రకాశించుచున్నది. ఏకమగు నీశ్వరునకు జీవులకువలె ననేకత్వ మెటుల యుండునని శంకించెదవేని వినుము. పుణ్యక్షేత్రములయందును, గ్రామములయందును, గృహములయందును శివవిష్ణ్వాదిమూర్తిభేదముతో వ్యవహరింపబడుచు నుండుటవలన అనేక ఈశ్వరులని చెప్పితిమి. "నారాయణ శ్శివో విష్ణు శ్శంకరః పురుషోత్తమః। ఏ తేషు నామభిః బ్రహ్మపరం ప్రోక్తం సనాతనం॥" (వరాహపురాణం. 77-12.) నారాయణుడు - శివుడు - విష్ణువు - శంకరుడు - పురుషోత్తముడు అను నిత్యాద్యనేకవిధములగు ఆకారసంజ్ఞలచేత సనాతనమైన (అనగా 'సనానిత్యే' - 'సదాభవ సనాతనః= నిత్యమైనది' అని కోశము). పరబ్రహ్మము మాత్రమే ప్రదిపాదింపబడుచున్నది. "నేహనానాస్తి కించన॥" (బృ. ఉ. 6-4-19.) వాస్తవముగ పరమాత్మకు నీ యనేకత్వ మెంతమాత్రమును లేదు. "ఏకో దేవః సర్వభూతేషు గూఢః సర్వవ్యాపీ సర్వభూతాంతరాత్మా॥" (శ్వే. ఉ. 6-11.) సకలభూతములయందును అంతరాత్మ- ప్రత్యగాత్మ - రూపమున గూఢముగ నుండి, సర్వత్ర పరిపూర్ణముగ వ్యాపించినదగుచు 'అస్తి = ఉన్నది' యనెడి సద్రూపమునను 'భాతి - ప్రకాశించుచున్నది' యనెడి చిద్రూపమునను ప్రకాశించుచున్నది ఏకమగు చిన్మాత్ర (జడసంపర్కములేని) పరమాత్మయే యని శ్రుతిసిద్ధాంతము.

శి:—స్వామీ! మృద్దారుశిలాదిరూపములగు నా మూర్తుల (విగ్రహముల) యందు ఈశ్వరత్వ మెటులుండును?

(సశేషము)



# ప్రపంచమతములు

## శ్రీ నిత్యానందస్వామి

## కాన్‌ఫ్యూసియానిజం

(గతసంచిక తరువాయి)

మన ఇరుగుపొరుగు దేశమైన చైనా యొక్క ప్రాచీనమతము కాన్‌ఫ్యూసియానిజం. చైనాదేశమందలి మఱి రెండు మతములును, తాయిజము, బౌద్ధమతము. కాన్‌ఫ్యూసియానిజముయొక్క శతాబ్దమునందు కన్‌ఫ్యూసియస్ అను మహాత్ముడు జీవించియుండెను. ఇతడు బుద్ధుని సమకాలికుడు. ఇదేకాలమున గ్రీసుదేశములో పైతాగొరస్ అను మహానీయుడును ప్రబలియుండెను. కంగ్-ఫు-త్సె అను చైనాదేశీయ నామము లాటిన్‌భాషలో కన్‌ఫ్యూసియస్ అని మార్పు జెందినది. ఈ కన్‌ఫ్యూసియస్ బోధనలలో సంఘక్షేమము, మానవలోకమున శాంతి, ఐకమత్యము, సుప్రసిద్ధములై, అగ్రశ్రేణి నలంకరించినవి. ముఖ్యముగా సాంఘికుల స్వభావము ననుసరించియే సంఘపద్ధతి ఏర్పడునని ఈతని యాశయము. ఈ యాశయముతోడనే మానవుల గుణకర్మముల నభివృద్ధిజేయుట కాతడు సమధిక కృషిసల్పెను.

(కన్‌ఫ్యూసియస్-ఇరువురు చైనాదేశీయులు)

జే-కన్గ్ :—ఒక్కని జీవితాంతమువఱకు ఏకైక సాధనా విధానముగ నుపయోగపడదగిన పదమొక్కటియున్నదా?

గురువు :—అన్యోన్యత (ఇచ్చిపుచ్చుకొనుట) అట్టిదికాదా? నీయెడ ఇతరులేకార్యము చేసిన నీకు అసమ్మతమగునో, అట్టి కార్యమును ఇతరులయెడ నీవు చేయకుము.

జూ-లూ :—తమకనుగుణ్యముగ పరిపాలనా విధానమును కొనసాగించవలయునని 'లేయ్' దేశాధిపతి తమరాకకై నిరీక్షించియున్నాడు.

గురువు :— పదములను సవరించడమే ముఖ్యము.

జూ-లూ :—తాము సెలవిచ్చినది సరియే. అయిన అట్టి సవరణ ఎందులకు?

గురువు :—నీవెంతటి అజ్ఞానివి! తనకు తెలియని విషయములలో ఉత్తముడు జాగ్రత్తతో నటించును.

పదములు సరియైనవికానిచో, భాష భావమునకు అనుగుణ్యముగ నుండదు. అసలు విషయమునకు భాష అనుగుణ్యము

కానిచో, జయప్రదముగ కార్యములు కొనసాగవు. కార్యములు చక్కగ కొనసాగనిచో యుక్తత, (న్యాయము) అవిరోధము (సమైక్యత) వృద్ధిగాంచవు. న్యాయ, సమైక్యతలు వృద్ధిబొందనిచో, దండన (శిక్ష) సక్రమముగ నిచ్చుటకు సాధ్యముకాదు. దండన సక్రమముగా లేని యెడల కాలు, చేతులు కదల్చుటకుకూడ మనుజులకు సాధ్యపడదు. కావున ఉత్తముడు మాటలాడునపుడు తాను నిర్వచించు ప్రకారము, తు-చ-తప్పక జరుప బడుటకు తన భావమునకు అనుగుణ్యమైన పదములనే ఉపయోగించును. తన మాటలలో పొల్లు ఏమాత్రముండకూడదనికూడ అతడు ప్రయత్నించును. పరలోక శాసనములు, మహాత్ములు, మహర్షులవాక్యములు, అను మూడు విషయములకు ఉత్తముడు భయభక్తులతో నమ్రుడగును.

# జొరవాస్ట్రియానిజం

ప్రాచీన ఇరాన్ లేక పర్షియాదేశ ప్రవక్తయైన జొరవాస్టర్ (జరతుష్ట్ర) యొక్క అనుయాయులు పార్శీలు.

స్వదేశమునుండి తఱుమబడినవారై పార్శీలు హిందూదేశమునకు వచ్చి స్థిరనివాసము లేర్పరచుకొనిరి.

జొరవాస్ట్రియన్ మతగ్రంథమైన జెండ్-అవెస్తకును, వేదమునకును సన్నిహిత సంబంధముండుట గమనార్హము. గౌతమబుద్ధ మహావీరులవలెనే జరతుష్ట్రుడును క్షత్రియుడే. ఇరాన్‌లో సాంప్రదాయసిద్ధమైయుండిన కర్మబాహుళ్యమతమును సంస్కరించి, పశుహింసాయుత కర్మకాండకు బదులుగా, భూలోకములో భగవానుని పవిత్ర చిహ్నమైన అగ్నియొక్క సామాన్యారాధనమును ప్రవేశపెట్టెను. జరతుష్ట్రుని గాథలలో కర్మమునకు ప్రాధాన్యమీయక, నడవడికిని, దాని నైతిక సంకల్పమునకును ప్రాధాన్యమీయబడినది. ఇట్టివి ఓహుమనో-ఆషా-అరమైతి అనునవి. అహురమజ్దా-దయామయుడైన భగవానుడు. దుష్టశక్తుల నిరోధించి, దైవమార్గమున జీవయాత్రను నడుపుట కనువగు సిద్ధాంతమునే మానవజాతికి జరతుష్ట్రుడు ప్రసాదించి యున్నాడు. యుద్ధవీరుని లక్ష్యమువంటిదే జొరవాస్ట్రియన్ మతలక్ష్యము. దృఢనిశ్చయముతోడను, త్యాగనిరతితోడను, లోకసేవతో కూడిన కర్మమువలననే మానవుడు ఇహలోకసుఖమును, హౌర్వతత్ = పరలోక సౌఖ్యమును, అమెరతత్ = అమృతత్వమును పొందవలెను.

## జరతుష్ట్రుడు – పార్శీ శిష్యులు

అహురమజ్దా :— ఎవ్వడు మాత్రము నా యాజ్ఞలవినెనో, ఎవ్వనిని మాత్రము నాకు చక్కగా తెలియునో, అట్టివాడే జరతుష్ట్రుడు. అతడు తన సృష్టికర్తకొఱకును, సత్యముకొఱకును, నా పవిత్ర సందేశమును ప్రకటింప దలచియున్నాడు. ఈ కారణముచేత దివ్యవాక్కును అనగా వశీకరణశక్తి యుక్తమైన వాగ్వైభవమును నే నాతనికి ప్రసాదించెదను. (డి. జే. ఇరానీ, రచిత జరతుష్ట్రగ్రంథము నుండి) జరతుష్ట్రుని దివ్యగానమును వినుడు.—

అవాఙ్మానసగోచరుడవగు పరమాత్మా? కరుణాసింధో? ప్రభో! భువిపై మోకరించి, ఆకసమువైపు చాచిన చేతులతో నిన్ను ప్రార్థించుచున్నాను. ఈ మహదానందమున సృజింపబడిన జీవకోటికి ఆనందమును చేకూర్చుటకై సమస్తజ్ఞానముతో కూడిన నిర్మల నిశ్చల బుద్ధిని, సర్వధర్మ సమ్మతమైన నైష్కర్మ్య సిద్ధిని, అనగా నిష్కామకర్మను నాకు అనుగ్రహింపుము. (శిష్యులతో)— కల్పాదియందు రెండు ప్రాథమిక శక్తులుండినవి. ఆ జంట, స్వతఃక్రియాశక్తి సహితమైనవి. మనోవాక్కర్మములలో మంచి, చెడ్డ, అనునవే ఈ జంట. బుద్ధిమంతులు ఈ రెంటిలో ఉత్తమమైనదానిని గ్రహించవలెను. అధర్మముగ ప్రవర్తించకుడు. న్యాయముగ ప్రవర్తింపుడు. దైవమును గూర్చి ప్రార్థించుడు. ఓ అహురమజ్ద? (భగవంతుడా?) విశ్వాసముగల భక్తులలో సంపూర్ణశక్తితో ధర్మము ప్రకాశించుగాత! ఎండగాయు భూమండలమంతటను ఆర్మెయ్తీ! భక్తిదేవత ప్రేమతో వసించుగాత! వారి వారి కర్మానుగుణ్యముగ సర్వులకును న్యాయమైన ప్రతిఫలము నిర్మలబుద్ధిద్వారా ప్రసాదింపబడుగాత!

(సశేషము)



# శ్రీ తురీయానంద లేఖావళి

శ్రీహరిశరణమ్

అమెరికా.

ప్రియతమ స్వ...

నీ విషయము నాకేమియు నర్థము కావుట లేదు. ఇంత విచార మెందులకు? జరిగిన దేమిటి? నిద్రయందు నీకింతటి వ్యామోహమేల "సేతే సుఖం కస్తు?—సమాధినిష్ఠః" * "నిద్రా సమాధి స్థితిః"—శివమానసపూజా స్తోత్రము. 'నాది, నాది' అనుకొనుచున్నచో నిద్ర గలుగునా? మనస్సును తన యిచ్ఛవచ్చినట్లు గంతులువేయనిమ్ము. కొంతసేపటికి అది నిశ్చలమయి యూరకుండును. ఆ తుంటరి (మనస్సు) నడతనుగూర్చి ఏమియు విచారింపవలదు. అదియే ముఖ్యాంశము. నీవు సారవిహీనుడవని యెట్లు గ్రహించితివి? నీ స్వవిషయమునం దింతటి సంభ్రమమేల? ఎందఱో జ్ఞానపిపాసువు లిచ్చటికి వత్తురన్నచో వారి కొఱకు తగు నేర్పాట్లు గావింతును. ఏమి? నీవు స్వవిషయమునుగూర్చియే ఆలోచించుచున్నావు. నిజముగా జెప్పుచున్నాను. ఇచ్చట ఎన్నో పనులున్నవి! ఏ పనియు లేనివాడే కూర్చొని తన్నుగూర్చి ఆలోచించుచుండును.

* సుఖనిద్ర ఎవరికి గలుగును?—సమాధినిష్ఠయందున్న పురుషునకు.

అట్టి యాలోచనవలన నే ప్రయోజనమును జరుగబోదు. చాలును. ఇతరులగూర్చి కొంచె మాలోచింపుము. నీవు సమ్మతించిన చో నిచ్చ టికి నీవు రాగల యేర్పాట్లు చేయింతును. ఇచ్చ టికి రమ్ము. సమస్తమును సరిపడును. అందర కును నా ప్రేమను దెలుపుము.

ఇట్లు,
శుభాశీర్వచనములతో,
శ్రీ తురీయానంద



శ్రీహరిశరణమ్

భగవాను డేమిచేసినను మన మేలున కే చేయుచున్నాడన్న భావమును మన మనో ఫలకమున దృఢముగా నిలుచునట్లు ఆయన ఆశీర్వదించునుగాక !

మెండుగా భక్తిసాధనల నొనరింపుము. అందరకును అనుకూలమగు సమయము లభిం పదుగదా! కావున ఎట్టి యవస్థయందుం చెనో అట్టి యవస్థయం దే యుండి ఆ భగవానుని పిలువుము. ఏల యందువా, మన మెల్లప్పుడును ఆయనను స్మరించుచు ఆయన యనుగతులము కానిమెడల మఱి ఏ యితర మార్గముననను శ్రేయస్సు పడయజాలము. మనము సంపూర్ణ ముగా ఆయనకు జెందియుండిననే మనకు కల్యాణము కలుగును. ఇదియే సిద్ధాంతము. యుక్తులునయిత మీా సిద్ధాంతము సమర్థించు చున్నవి. ఈ విషయమున మహాపురుషులంద రకు ఒక టే యభిప్రాయము గలదు. బుద్ధిమం తుడు సమస్తకష్టముల నడుమ పరిభ్రమించు చున్నను భగవానుని స్మరించుచు కష్టసము దాయములను తరించిపోవుచుండును.

భగవత్కృపవినా భాగ్యమేమియులేదు. ఎవనికిది ఎంతవఱకు లభింపగలదో వా డంతటి శాంతిని పొందగలడు. నీవు మా కెంతో దూర మున నున్నావని తలంపకుము. దూరము దగ్గర—ఇవన్నియు మనోవ్యాపారము లే. ఎంత దూరమున నున్నను మాదగ్గర నున్న ట్లే. మరి చాలదగ్గర నుండుటయు మిక్కిలి దూరము కావచ్చును. నీవు ఎల్లప్పుడు మాదగ్గర నే యుండుచున్నావు.

నన్ను భగవాను డెచ్చటికి దీసికొనిపోవునో ఆయన కే గుఱుతు. ఎందు దోడ్కొనిపోయినను స రే. ఆయన పాదపద్మములందు నా మనస్సు లగ్న మగునట్లొనరింపవలయుననియే నా ప్రార్థన. భగవదిచ్ఛ యే నెఱవేఱును. అదంతయు మన మేలున కే. ఇం దేమియు సందియము లేదు. కాని మన మనస్సు దీనిని గ్రహింపదు. దానికంతటి ఓపికయు లేదు. ఈ విషయమును నమ్మగలిగి నచో మనము మరి యే యితరమార్గముననను శాంతిని జేకూర్చుకొనజాలము. భగవాను డేది కావించినను సరియే వాస్తవముగా అది మన మేలున కే యన్న విశ్వాసము మన బుద్ధియందు సుస్థిరముగా నాటుకొనకపోయినచో మన హృదయమున శాంతి యనునదియే యుండదు. శరీరము ధరించినచో సుఖదుఃఖములు రోగ శోకములు—ఇవన్నియు ననివార్యము లే. ఇవి తప్పక కలుగును. కాని మేలుగలుగుట మంచి దనియు దుఃఖముగలుగుట చెడుపనియు తలం చుట శోచనీయము. ఇదంతయు తెలిచుగా స్వార్థపరత. ప్రభువు సుఖదుఃఖములయందును రోగశోకాదులయందును మన మనస్సు తన యందే లగ్నమయియుండునట్లొనరించుగాక ! ఏ సమయమునందును సచ్చింతలు మనలను వీడిపోవకుండునట్లు ఆయన ఆశీర్వదించుగాక !

ఇదియే మనము చేయవలసిన నిష్కపటమగు ప్రార్థన.

శ్రీ స్వామివారు నిన్నాశీర్వదించియున్నారు. ఈ శీతకాలమున నీ యారోగ్యము బాగుపడును. ఆరోగ్యము సరిపడనిచో భజనలును సాధనలును మటుమాయములగును. కావున ఆరోగ్య సంరక్షణమునకు బ్రయత్నింపవలయును. ఇది నే జెప్పనవసరము లేదు.

మీరందఱు నెట్టి బ్రహ్మచారులు? శరీరమునుగూర్చి యింతగా శ్రద్ధవహించుచున్నారు! శరీరధర్మమే ఇట్టిది—ఒకప్పుడు స్వస్థముగా నుండును, మఱియొకప్పుడు అస్వస్థముగా నుండును. చివరకు ఒకనాడు నశించును. ఈ శరీరమునం దొకడు గలడు. వానికి పెరుగుట గాని తగ్గుటగాని యుండదు. ఇది నీవొకనాడు కనుగొనగలవు.

భగవచ్చరణములకు నిన్నర్పించుకొంటివి కాన నీ భారమంతయు ఆయనయే భరించును. ఎట్లు చేయవలయునో అట్లే చేయించుకొనును. ఆయన చేతియంత్రమువలె ఆయన చూపిన మార్గమున నడువుము. ఆ మార్గమున జరించినచో నీ కెట్టిభయముగాని శోకముగాని కలుగదు. భగవచ్చరణాశ్రితులకు భయమేమి? 'హరి సీలో రహారే భాయ్, తేరా బనత బనత భానీ జాయి.' క్రమముగా సమస్తమును చక్కబడును. ఏ భావనయు నుండదు. తొట్రుపాటు సహితము అనావశ్యకము. గురుదేవుని కృపవలన అచ్చటి (చెన్నపురి మఠము) నుండి ఎన్నియో శుభకార్యము లనుష్ఠింపబడగలవు. అది నా కల్పనాదృష్టితో దివ్యముగా జూచుచున్నాడను. గురుదేవుడు తనకార్యమును తానే యొనర్చుకొనుచుండును. చేయుచున్నాడు గూడ. ఆయనచేత యంత్రరూపమున నడుపబడువారెల్లరును ధన్యులు. నీవు వారి యంత్రమవై విశేషముగా వారికార్యముల నొనర్ప దలచియున్నావని విని నాకు నిర్భరానందము గలుగుచున్నది. నీవు ప్రతిదినమును ఆయన ప్రియకార్యముల ననుష్ఠించి నీ జీవితమును తరింపజేసికొనుటయే కాక జనసామాన్యము సమస్తమును తరింపజేసి పరమశ్రేయోధికారివి కావలయుననియే సర్వాంతఃకరణముతో భగవానుని బ్రార్థించుచున్నాను.

భగవానుడు తనకార్యముల దా నొనర్చుకొనుచునే యుండును. కాని యీ కార్యమునం దుత్సాహపూర్వకముగ దన్ను సమర్పించుకొనువాడే ధన్యుడు, కృతకృత్యుడౌనని తెలిసికొనుము. మిమ్ము భగవంతుడు తన కార్యములందు నిలిపి యీ విధముగ ధన్యులను కృతార్థులను గావింపవలయుననియే నా ప్రార్థన.

భగవానుడు మంగళమయుడు. ఎల్లప్పుడు మంగళమునే కలిగించుచున్నాడు—ఈ విషయమునందు దృఢవిశ్వాసమున్నచో మరి యెవైపును జూడనవసరము లేదు. ఆయనయు ఈ భావము మనహృదయమున బాదుకొల్పును. మీరందఱును నాకొఱకు ఇట్లే ప్రార్థింపవలయును :—"నాన్యాస్పృహా రఘుపతే హృదయేఽస్మదీయే, సత్యం వదామి చ భవాన్ అఖిలాంతరాత్మా, భక్తిం ప్రయచ్ఛ రఘుపుంగవ నిర్భరాన్మే, కామాదిదోషరహితం కురు మానసం చ—ఓ రఘుపతీ! సత్యమునే పలుకుచున్నాను. నా హృదయమునందు ఇతరములగు కోరికలు లేవు. నీవు సర్వజగదంతరాత్మవు. (కావుననే దానిని నిశ్చయముగా నీవెఱుగుదువు) ఓ రఘుశ్రేష్ఠా! నాకు దృఢ

భక్తినిమ్ము. మఱియు నా మనస్సును కామాది దోషరహితము గావింపుము.'—ఈ ప్రార్థనయే నాలో పూర్ణశాంతిని ఆశాభావమును కలిగించినది. ఇంతమాత్రము లభించినచో పూర్ణత్వము కడుంగడు సమీపస్థమువలె నాకు గోచరించినది. ఇది మనకు లభించినచో అమరత్వము గూడ తుచ్ఛమువలె గాన్పించును. 'పుట్టినచో మరణము తప్పదు. అమరత్వము నీకెట్లు లభింపగలదు?' అని యొకానొక కవి నుడివియున్నాడు. కాని ఈ భావముతో మరణించినచో మరణమును సార్థకమేయగును. శరీరార్థ మెంతమాత్రము చింతకలుగదు. ఎప్పుడు? ఇట్టి పవిత్రభావమును బడసినపుడేకదా! మహామాయాకృత్యముల నెవడును గ్రహింపజాలడు. 'జ్ఞానినామపి చేతాంసి దేవీ భగవతీ హిసా, బలా దాకృష్య మోహాయ, మహామాయా ప్రయచ్ఛతి—ఆ దేవి భగవతి; మహామాయి. జ్ఞానుల చిత్తములను ఆకర్షించి మోహితుల నొనర్చును.'—దేవీమాహాత్మ్యం, ౧-౫౫.

ఎల్లపుడు చేతులుజోడించి ప్రార్థనాసీనులమై యున్నట్లయిననే మనము రక్షింపబడగలము. మండెడు పిడుకనుజూచి నవ్వినదట పేడ. ఈ సంసారమున నిదియే భావము.

అమ్మా! నీవు రక్షింపనిచో నాకిక రక్షకులు లేరన్న విషయము నిజమే. భగవదిచ్ఛయే జరుగగలదు. ఆయన పాదపద్మములందు మనస్సును లగ్నము గావించినచో నితరవిషయములగూర్చి ఆలోచింపనవసరము లేదు. ఆయన కృపయే మన సర్వస్వము. ఎల్లపుడును ప్రార్థనాసీనుడవుకమ్ము. ప్రభుసన్నిధిని నీ ఆంతరంగిక భావములన్నియు నివేదింపుము. ఆయన యొక్కడే నీవాడన్న భావము దృఢమయినచో భయంకరభావము లేమియు నుండబోవు. సమస్త విషయములను ఆయనయే నీకెఱిగింపగలడు.

ఇట్లు,
నీ శుభాకాంక్షి,
శ్రీ తురీయానంద

# సంఘవార్తలు

## చెన్నపురి శ్రీరామకృష్ణమఠమున

# శ్రీ వివేకానంద స్వాములవారి

## తొంబదియొకటవ జన్మదినోత్సవము

చెన్నపురి శ్రీరామకృష్ణమఠమున శ్రీమద్వివేకానందస్వాములవారి తొంబదియొకటవ జన్మదినోత్సవ తిథి పూజ 7-1-1953 బుధవారము ఉదయము 8 ఘంటలు మొదలు 11 ఘంటలవఱకు జరుపబడెను. ప్రార్థనయందును భజనయందును ఎందఱో స్త్రీ పురుషులు పాలు పుచ్చుకొనిరి. 11 ఘంటలకు హోమము జరుపబడినది. హోమానంతరము సుమారు 500 భక్తులకును 700 దరిద్రనారాయణులకును అన్నప్రసాదము పెట్టబడినది. నాడు తిథి పూజ జయప్రదముగ ముగిసినది.

11-1-1953 ఆదివారమునాడు చెన్నపురి శ్రీరామకృష్ణమఠమున బహిరంగోత్సవము జరుపబడినది. ఈ రెండు కార్యక్రమములును శ్రీ రామకృష్ణమఠ సేవాసంఘ సర్వాధ్యక్షులు పూజ్యపాదులు శ్రీమత్ శంకరానందస్వాములవారి ఆగమనమువలన అత్యంత పవిత్రీకృతములైనవనుట అతిశయోక్తికాజాలదు.

తిథిపూజానంతరము నాటిరాత్రి ఆరాత్రికము జరుపబడినది. ఆపిమ్మట పూజ్యపాదులు శ్రీమత్ శంకరానందస్వాములవారు భక్తులకు దయతో దర్శనమొసగి ఆశీర్వదించిరి. శ్రీవారి దర్శనానంతరము శ్రీసుపర్ణానందస్వాములవారు సభాగతులగు సాధువులయెదుటను భక్తులయెదుటను శ్రీ వివేకానందస్వాములవారి కీర్తితములగు గేయముల నాలాపించిరి.

11-1-1953 నాడు జరుపబడిన బహిరంగోత్సవమునందు నూతనక్రమ మనుసరింపబడినది. అధికసంఖ్యాకులగు యువకులతోడను సాధువులతోడను గూడిన కైవారముచే ఎనిమిది సంపుటములయం దిమిడియున్న శ్రీ వివేకానంద సంపూర్ణగ్రంథమాలా పారాయణము చేయబడెను. పూజ్యపాదులగు సర్వాధ్యక్షులు శ్రీమత్ శంకరానందస్వాములవారు ఈ సమయమును కొంతకాలముపాటు తమ దర్శనమువలన పునీతముగావించిరి. పారాయణానంతరము శ్రీమత్ రాఘవానందస్వాముల వారి అధ్యక్షతను, శ్రీ దేశికానందస్వామి, శ్రీ అజయానందస్వామి, శ్రీ ఆగమానంద స్వామి శ్రీ అవినాశానందస్వామియును సాధుపుంగవులు సభాసదులగు భక్తులయెదుట కొలది నిముసములపా టుపన్యసించిరి.

శ్రీ రాఘవానందస్వాములవారు తమ అధ్యక్షోపన్యాసమునందు శ్రీ వివేకానంద స్వాములవారి జీవితవిశేషములను కార్యాచరణములను వివరించిరి. *

---

* స్థలాభావమువలన ఉపన్యాసముల సారాంశముల నిందు పొందుపఱుపజాలకపోయితిమి. రాబోవు సంచికయందు ప్రచురింపగలము.

తదుపరి భక్తులసంఖ్యాకులును పారాయణ గావించినవారును నాడు మఠమున ప్రసాదమును గైకొనిరి.

నాటి మాధ్యాహ్నిక కార్యక్రమము 3 ఘంటలకు ప్రారంభింపబడెను. ప్రథమమున శ్రీ తురీయాత్మానందస్వాములవారు శ్రీ వివేకానందస్వాములవారి జీవితమునుగూర్చి హరికథా కాలక్షేపముగావించిరి. 5-30 ఘంటలకు పూజ్యపాదులు సర్వాధ్యక్షులు ఆహ్వానసంఘాధ్యక్షులగు సర్ సి. పి. రామస్వామి అయ్యరుగారికి స్వాగతమొసగిరి. సాయంత్ర కార్యక్రమమునకు సర్ సి. పి. రామస్వామి అయ్యర్‌గారు అధ్యక్షతవహించి తమ అధ్యక్షోపన్యాస మొసగిరి. తదుపరి గౌరవనీయులగు న్యాయమూర్తులు శ్రీ పి. సత్యనారాయణరావుగారు ఆంధ్రమున నుపన్యసించిరి. పిమ్మట శ్రీ కె. చంద్రశేఖరన్ ఎం. ఏ. గారు 'శ్రీవివేకానందస్వాములవారి మతపరిజ్ఞానము' అన్నవిషయమునుగూర్చినవ్యాసమును జదివిరి. పిదప డాక్టర్ పి. సుబ్బరాయన్‌గారు తమిళమున నుపన్యసించిరి. చిట్టచివర దక్షిణ కాలిఫోర్నియా వేదాంతసంఘమునకు సంబంధించిన బ్రహ్మచారి జాన్ ఆర్. ఏల్ '(శ్రీ) వివేకానందులనేల అమెరికనులు ప్రశంసింతురు' అన్న వ్యాసమును జదివిరి.

ఈఉపన్యాసములయనంతరమునసభాధ్యక్షులు సర్ సి. పి. రామస్వామి అయ్యర్‌గారు అంతఃకళాశాలా పోటీపరీక్షలయందుపాల్గొని విజయమందినవిద్యార్థులకు బహుమతులు పంచిపెట్టిరి.

అధ్యక్షోపన్యాసానంతరము మఠాధ్యక్షులు పూజ్యపాదులు శ్రీ కైలాసానందస్వాములవారు అభివందనములు సమర్పించిరి.

# విజ్ఞాపనము

శ్రీ రామకృష్ణ భగవానుడు జన్మించిన పవిత్రస్థలము కమ్మరిపుష్కరిణి. ఇదియును పవిత్ర తీర్థముగా వేలకొలది ప్రజలచే కొనియాడబడుచుండుట యెల్లరకును విదితమే. శ్రీవారి బాల్యజీవనసంబంధమగు ప్రదేశములను పవిత్ర వస్తుసముదాయమును జాగ్రత్తపఱచుటకై శ్రీ రామకృష్ణ సంస్థ నిర్వాహకులు ప్రయత్నించుచున్నారు. అచ్చట శ్రీ రామకృష్ణులవారి మందిరమును దానియందు చలువరాతివిగ్రహ ప్రతిష్ఠాపనమును దాని పరిసరమున శ్రీ రఘువీరమందిరమునుగూడ నిర్మించి ఆ స్థలమునకు బేలూరుమఠస్థులు శోభను కలిగించియున్నారు. దాని పరిసరముననే యున్న అతిథిశాల యెల్లరకును ఎంతో ఉపయోగకరముగ నున్నది. ప్రస్తుతము అచట నపుడపుడు వ్యాధిపీడితులై కష్టములకు లోనగుచున్న ప్రజానీకము నారోగ్యప్రదానముకొఱకు ఒక చికిత్సాకేంద్రమును, అచట జరుగుచున్న ప్రారంభ పాఠశాలను Ideal Basic School (బేసిక్ పాఠశాలగా) మార్చుటకును, పుస్తకభాండాగారమును నెలకొల్పుటకును, అచట పనిచేయుచున్న సాధువులకు వసతిగృహమును నిర్మించుటకును, హాలధారి పుష్కరిణి సరస్సును మరమ్మత్తుచేయుటకును, చలిజ్వరమువలన బాధపడుచున్న స్థానికప్రజల ఆరోగ్యమును గాపాడుటకును ఎంతయో ధన మావశ్యకము.

ఆ కేంద్రమును చక్కగ నడపుటకుగూడ ఆర్థికసహాయ మత్యంతావసరమైయున్నది.

దానశీలురగు దాతలెల్లరు ఈ కార్యమున ధనసహాయము గావించి మా కార్యక్రమమును జయప్రదము గావింతురుగని ప్రార్థించుచున్నారము.

విరాళములు ధనరూపముననేమి వస్తురూపముననేమి కృతజ్ఞతతో స్వీకరింపబడును. ఇట్లు,

శ్రీ వగళానందస్వామి.

విరాళము లీ క్రింది విలాసమునకు బంప ప్రార్థన :

SWAMI VAGALANANDA,
*President,*
Sri Ramakrishna Math,
KAMARIPUKUR,
Hubli Dt.. West Bengal.

## OUR ENGLISH PUBLICATIONS

### Books at Concession Rates to VEDANTA KESARI Subscribers

*(While placing order please mention your V. K. Subs. No. without fail)*

| NAMES OF BOOKS | | Original Price Rs. | As. | Concession Price Rs. | As. |
|---|---|---|---|---|---|
| Sri Ramakrishna the Great Master | (Calico) ... | 25 | 0 | 24 | 0 |
| ,, ,, ,, | (Morocco) ... | 35 | 0 | 33 | 8 |
| The Gospel of Sri Ramakrishna | (Calico) ... | 20 | 0 | 18 | 12 |
| ,, ,, ,, | (Morocco) ... | 30 | 0 | 28 | 2 |
| Sayings of Sri Ramakrishna | ... ... | 5 | 0 | 4 | 11 |
| Thus Spake Sri Ramakrishna | ... ... | 0 | 6 | 0 | 6 |
| Tales and Parables of Sri Ramakrishna | ... ... | 2 | 8 | 2 | 5 |
| Sri Ramakrishna: His Unique Message | ... ... | 2 | 0 | 1 | 14 |
| Sri Ramakrishna and His Mission | ... ... | 0 | 10 | 0 | 9 |
| The Master and the Disciple | ... ... | 2 | 0 | 1 | 14 |
| Sri Sarada Devi (Ordinary) | ... ... | 6 | 0 | 5 | 10 |
| ,, (De Luxe) | ... ... | 9 | 0 | 8 | 8 |
| Inspired Talks (Board) | ... ... | 2 | 0 | 1 | 14 |
| ,, (Calico) | ... ... | 3 | 0 | 2 | 13 |
| Hinduism | ... ... | 1 | 0 | 0 | 15 |
| Education | ... ... | 0 | 12 | 0 | 11 |
| The Eternal Companion (Ordinary) | ... ... | 2 | 4 | 2 | 2 |
| ,, ,, (Calico) | ... ... | 3 | 4 | 3 | 0 |
| Thus Spake Vivekananda | ... ... | 0 | 6 | 0 | 6 |
| For Thinkers on Education | ... ... | 3 | 0 | 2 | 12 |
| The Story of a Dedicated Life | ... ... | 3 | 0 | 2 | 12 |
| The Message of Eternal Wisdom | ... ... | 3 | 0 | 2 | 12 |
| God and Divine Incarnations | ... ... | 2 | 4 | 2 | 2 |
| The Ancient Quest | ... ... | 1 | 8 | 1 | 6 |
| Sri Krishna, The Pastoral and King-maker | ... | 1 | 2 | 1 | 0 |
| Isavasya Upanishad | ... ... | 0 | 12 | 0 | 11 |
| Kenopanishad | ... ... | 0 | 12 | 0 | 11 |
| Kathopanishad | ... ... | 1 | 8 | 1 | 6 |
| Prasnopanishad | ... ... | 1 | 0 | 0 | 15 |
| Mundakopanishad | ... ... | 1 | 0 | 0 | 15 |
| Mandukyopanishad | ... ... | 0 | 12 | 0 | 11 |
| Taittiriya Upanishad | ... ... | 2 | 0 | 1 | 14 |
| Svetasvatara Upanishad | ... ... | 1 | 8 | 1 | 6 |
| Brihadaranyaka Upanishad | ... ... | 7 | 8 | 7 | 0 |
| Srimad-Bhagavad-Gita | ... ... | 7 | 0 | 6 | 8 |
| Bhagavad-Gita: the Song of God | ... ... | 2 | 12 | 2 | 9 |
| Upadeshasahasri | ... ... | 3 | 8 | 3 | 4 |
| Atmabodha | ... ... | 4 | 0 | 3 | 12 |
| Yatindramatadipika | ... ... | 5 | 0 | 4 | 11 |
| Srimad Bhagavatam: the Wisdom of God | ... ... | 3 | 8 | 3 | 4 |
| Stotraratna | ... ... | 0 | 12 | 0 | 10 |
| Divine Life | ... ... | 3 | 0 | 2 | 13 |
| Universal Prayers | ... ... | 2 | 4 | 2 | 2 |
| Prince of Ayodhya (Ordinary) | ... ... | 3 | 0 | 2 | 12 |
| ,, (Calico) | ... ... | 4 | 8 | 4 | 4 |
| Vedic Religion and Philosophy (Board) | ... ... | 2 | 8 | 2 | 5 |
| ,, ,, (Calico) | ... ... | 3 | 8 | 3 | 4 |
| Narada Bhakti Sutras (Just Out) | ... ... | 3 | 0 | 2 | 13 |

**Please ask for the Detailed Catalogues of our Tamil and Telugu Books**

**SRI RAMAKRISHNA MATH,** *Publication Department,* **MYLAPORE, MADRAS-4**

# శ్రీ మద్భగవద్గీత

శ్రీ నిర్వికల్పానందస్వామిచే అనువదింపబడినది. ప్రతిపదార్థ టీకాతాత్పర్య శ్రీధరీయ టీకాసార విశేషాంశ సహితము. గీతా తత్త్వమను వివరణ ప్రాయమగు వ్యాసరాజముతో నలరారుచున్నది.

...ఇందలి పాద దీపికలన్నియు అమృతబిందువులు.

—వేలూరి శివరామశాస్త్రి

...కడు సుందరమై విశేషార్థమందరమై యున్నది.

—ఆంధ్రప్రభ

424 పుటలు వెల : రూ. 3-0-0

# శ్రీ బ్రహ్మానంద బోధనలు

(శ్రీ బ్రహ్మానందస్వామి జీవితోపదేశములు)

గ్రంథకర్తయు అనువాదకర్తయు: శ్రీ చిరంతనానందస్వామి

త్రివర్ణముఖచిత్రము శ్రీ రామకృష్ణబ్రహ్మానందస్వాముల ఛాయాచిత్రములు గలవు.

భక్తులకును సాధకులకును కల్పతరువువంటిది. ఆధ్యాత్మిక జీవనరంగమున సాధకులు అనుసరింపవలయు మార్గములన్నియు నిందు విపులముగ వివరింపబడియున్నవి.

జీవితభాగమున శ్రీ రామకృష్ణమానసపుత్రుడగు శ్రీ బ్రహ్మానందస్వాములవారి వ్యక్తిత్వము, ప్రతిభాతిశయము, నిరంతరభగవదనుసంధానదీక్ష, లోకసంగ్రహకర్మాచరణము, శిష్యశిక్షణము మున్నగు నంశములు తేటతెల్లముగ రచింపబడియున్నవి.

ఉపదేశభాగమున భగవదస్తిత్వము, భగవదన్వేషణము, ఆత్మసమర్పణము, పూజాధ్యానములు, నామస్మరణము, మంత్రోపదేశము, జపము, తపము, కుండలినీప్రబోధము, సాధనాంతరాయనిరోధణము, మనోనిగ్రహము, సాక్షాత్కారము మున్నగు విషయములు మృదుమధురమై శ్రావ్యమై రసోచితమయిన భాషయందు గురుశిష్య సంవాద రూపమున అనువదింపబడియున్నవి.

ఈ గ్రంథపఠనమున భక్తులును సాధకులును సంపూర్ణఫలమునందగలరనుట నిశ్చయము!

344 పుటలు ప్రజ్వలమగు ప్రథమముద్రణము : గ్లేజు కాగితములు. వెల : రూ. 3–8–0

ఇట్లు వ్రాయుడు :

శ్రీ రామకృష్ణమఠము, మైలాపూరు, చెన్నపురి

# శ్రీ రామకృష్ణమఠ ప్రచురణములు

## శ్రీ రామకృష్ణ లీలామృతము

496 పుటలు దివ్యమగు ద్వితీయ ముద్రణము! రూ. 5-0-0

## బ్రహ్మానంద బోధనలు

344 పుటలు ప్రజ్వలమగు ప్రథమ ముద్రణము! రూ. 3-8-0

## శ్రీ రామకృష్ణ బోధామృతము (సంగ్రహ జీవితసహితము)

540 పుటలు సర్వాంగ సుందరమగు చతుర్థ ముద్రణము వెల రూ. 3-4-0

## శ్రీమద్భగవద్గీత

480 పుటలు శ్రీధరీయ టీకాసార ప్రతిపద టీకాతాత్పర్య విశేషార్థ సహితము రూ. 3-0-0

## శ్రీ వివేకానంద జీవిత చరిత్ర

432 పుటలు పండిత పామర రంజకమైన శైలి. అందమగు 6-వ కూర్పు రూ. 3-0-0

## శ్రీ శారదాదేవి చరిత్ర

256 పుటలు ఇంటింటను ఉండతగిన దివ్యగ్రంథము. ముద్దులొలుకు రెండవ కూర్పు వెల రూ. 1-12-0

## శ్రీ నాగమహాశయుని జీవిత చరిత్ర

186 పుటలు (ఆదర్శప్రాయుడగు గృహస్థుని జీవితము) వెల రూ. 1-4-0

| | | | | |
|---|---|---|---|---|
| శారదా ప్రసంగములు | ... | 2 | 8 | 0 |
| ప్రబోధరత్నాకరము | ... | 2 | 4 | 0 |
| రాజయోగము | ... | 2 | 4 | 0 |
| కర్మయోగము | | 1 | 8 | 0 |
| భక్తియోగము | ... | 1 | 4 | 0 |
| వివేకానందలేఖావళి (మొదటి భాగము) | | 1 | 8 | 0 |
| వివేకానందలేఖావళి (రెండవ భాగము) | | 1 | 8 | 0 |
| అనుష్ఠాన వేదాంతము | ... | 1 | 4 | 0 |
| వివేక సూర్యోదయము | ... | 1 | 0 | 0 |
| శ్రీ పరమహంస నీతికథా రత్నములు | | 0 | 12 | 0 |
| భక్తిమార్గము | ... | 0 | 8 | 0 |
| చికాగో నగరోపన్యాసములు | ... | 0 | 8 | 0 |

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| గురూపదేశములు | ... | | | | | 0 | 8 | 0 |
| నా సంస్కరణ యుద్ధవిధానము | ... | | | | | 0 | 6 | 0 |
| నా గురుదేవుడు | ... | | | | | 0 | 6 | 0 |
| శ్రీ పరమహంస జీవిత సంగ్రహము | | | | | | 0 | 4 | 0 |
| నవీన భారతదేశము | ... | | | | | 0 | 4 | 0 |
| ముక్తిమార్గము | ... | | | | | 0 | 8 | 0 |
| సర్వం విష్ణుమయం జగత్ (తెలుగు) | | | | | | 0 | 8 | 0 |
| శ్రీ రామనామ సంకీర్తనము | ... | | | | | 0 | 1 | 0 |
| యతిగీతము (పద్యకావ్యము) | ... | | | | | 0 | 1 | 0 |
| నా మతము | | 0 | 0 | 6 | డజను | 0 | 5 | 0 |
| సింహ గర్జన | | 0 | 0 | 6 | డజను | 0 | 5 | 0 |

ఇవియేకాక

సంస్కృత, ఆంగ్ల, ద్రావిడ, హిందీ, కన్నడ గ్రంథములును

**వేదాంతకేసరి (ఆంగ్లము) శ్రీ రామకృష్ణ విజయము (తమిళము)**

అను మాసపత్రికలును మావద్ద దొరకును

ఇట్లు వ్రాయుడు:

మేనేజరు, శ్రీ రామకృష్ణమఠము, మైలాపూరు, చెన్నపురి.

సంపాదకులు: శ్రీ ఋతజానందస్వామి
శ్రీ కే. ఎస్. ఎస్. రాజన్ గారిచే ది జ్యూపిటరు ప్రెస్సు లిమిటెడ్ (జి. టి. మద్రాసు) న ముద్రింపబడి,
శ్రీ శుద్ధసత్వానందస్వామిచే శ్రీ రామకృష్ణమఠము (మైలాపూరు) నుండి ప్రచురింపబడినది. 16-2-53.